# శ్రీ రమణగీత

శ్రీ రమణ విభక్త్యష్టక

శ్రీ రమణ చత్వారింశత్

గీతమాలా సహితము.



SRI RAMANASRAMAM

ప్రకాశకులు:

శ్రీ నిరంజనానంద స్వామి

సర్వాధికారి, శ్రీ రమణాశ్రమము

తిరువణ్ణామలై

వెల ] [8 అణాలు.

అనువాదకులు :

గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్యగారు, ఎం. ఏ.

సర్వస్వామ్యసంకలితము.

ముద్రాపకులు
లిబర్టీ ముద్రణాలయము,
సుంకురామశెట్టి వీధి,
మద్రాసు.



క. తా ననుభవించి యొరులకు, జ్ఞానము నుపదేశమిలను గావించుటకై
మేనుగొనినట్టి శ్రీ భగ, వానునకున్ రమణఋషికి వందనమిడెదన్.

# విన్నపము.

ఈ యనువాదములు శ్రీ రమణమహర్షి భగవచ్చరణార విందములమీఁది భక్తికతముననే రచియింపఁ బడినవి. కావున నిప్పాత్తమునందలి తప్పులనెల్ల నొప్పరికింప సహృదయులు ప్రార్థితులు.

తమాల'' యందలి 'ఇంద్రగీతము' కీర్తిశేషులగు శ్రీ కావ్యకంఠ వాసిష్ఠ గణపతిమునీంద్రుల సొంత యనువాదమే. ఏకాదశగీతము 'తారకరామగీతము' అనునది యిప్పుడు క్రొత్తగాఁ జేర్పఁ బడిన యనువాదము.

''గీతమాల''ను ఆంధ్రీకరించుటకు పరమాదరముతో అనుమతి నొసంగినవారు శ్రీయుతులు అ. మహాదేవశాస్త్రి గారు కీ. శే. కావ్యకంఠుల పుత్త్రులు ఎంతయుఁ బ్రశంసార్హులు.

ఈ పుస్తకమాద్యంతము ముద్రణమునకు వలయునట్లు వ్రాఁతప్రతి వ్రాసి ప్రూఫులు సరిచూచి యెంతయేని క్లేశము సహించి భగవత్కైంకర్యమునఁ బాల్గొన్న భక్తులు శ్రీయుత వేదము అనంతాచార్యులు బి.యె., గారు కృతకృత్యులు.

ఏతద్గ్రంథముద్రణ పర్యాప్త ధనమును భక్తిపూర్వకముగ శ్రీ రమణాశ్రమమునకు సమర్పించి శ్రీ భగవచ్చరణ వరివస్యఁ గావించిన నెల్లూరువాస్తవ్యులు జమీందారులు శ్రీయుత రేబాల పట్టాభిరామరెడ్డిగారికి ధన్యవాదములు. శ్రీ రెడ్డిగారికిని తత్కుటుంబీయులకును భగవానుఁడు సమస్తములగు శ్రేయములను అనుగ్రహించును గావుత.

| | |
|---|---|
| శ్రీ రమణాశ్రమము,<br>అరుణాచలము. | ఇట్లు,<br>అనువాదకుఁడు. |

# గ్రంథక్రమము.


| | | | |
|---|---|---|---|
| శ్రీ అరుణాచలపంచరత్నము | ... | ... | 1 |
| శ్రీ రమణగీత | ... | ... | 4 |
| శ్రీ రమణవిభక్త్యష్టకము | ... | ... | 79 |
| శ్రీ రమణచత్వారింశత్ | ... | ... | 83 |

గీతమాల:—

| | | | |
|---|---|---|---|
| 1. అగ్నిగీతము | ... | ... | 93 |
| 2. గణపతిగీతము | ... | ... | 96 |
| 3. ఇంద్రగీతము | ... | ... | 99 |
| 4. వాయుగీతము | ... | ... | 107 |
| 5. సూర్యగీతము | ... | ... | 110 |
| 6. దశావతారగీతము | ... | ... | 113 |
| 7. అంబికాగీతము | ... | ... | 116 |
| 8. రేణుకాగీతము | ... | ... | 120 |
| 9. గురుగీతము | ... | ... | 123 |
| 10. యోగసారగీతము | ... | ... | 126 |
| 11. తారకరామగీతము | ... | ... | 129 |

ఓం

శ్రీ రమణాయ నమః

# శ్రీ అరుణాచల పంచరత్నము

క. కరుణాపూర్ణసుధాబ్ధీ,
పరికబళితవిశ్వరూప భానువితానా,
అరుణాచల పరమాత్మా,
అరుణుఁ డగుము చిత్తకంజ మతి వికసింపన్. ౧

క. నీయం దఖిలము చిత్రం
బీయది పొడమును నిలుచు లయించును; హృదియం,
దో యరుణాచల, నే నని
యీ యాత్మవు గా నటింప హృది యండ్రు నినున్. ౨

క. నే నను నిది వచ్చుట యె
చ్చోనని, యరుణాద్రి, లోనఁ జొచ్చిన విమలం
బైన మతి వెదకి, గని తన
దా నాకృతి, నబ్ధి నదిగ, నడఁగున్ నీలోన్. 3

క. విడి విషయము బాహ్యమ్మును,
ఒడిచియుఁ బ్రాణమును మనము, నో యరుణాద్రీ,
యెడఁదను నిను ధ్యానింపఁగఁ,
బొడఁగను నీయందె యోగి భూరిజ్యోతిన్. ౪

క. నీయం దర్పితమౌ మది
నీయఖిలము నీదు రూపమే యని, యరుణా
ద్రీ, యనితరరతిఁ గొలిచెదు
నా యతఁడు జయించు, మునిఁగి పోయిన్ నీలోన్. ౫

క. తెనుఁ గీ పంచకము రమణ
ముని దర్శన, మమరభాషఁ బ్రోక్తం బార్యం
బను గీతమ్మున నరుణా
ద్రిని గూరిచి యౌపనిషద కృతి రత్నముగాన్. ౬

## గ్రంథప్రశంస.

చ. అమలతరంబు గీతయన నౌనిది గంగ, మహోన్నతోల్లస
ద్రమణమహర్షి రూపనగరాడ్జనిర్యై, కవిరాడ్గణేశవ
క్త్రిమను పథంబునం దనుపదం బతికల్మషనాశినీప్రవా
హమగుచు, సర్వభక్త హృదయంబను నంబుధి సంగమం
[బగుఁ.

శ్రీ

# రమణగీత

## ప్రథమాధ్యాయము

### ఉపాసన ప్రాధాన్య నిరూపణము

క. శ్రీరమణఋషికి మనుజా
కారమ్మును దాల్చినట్టి స్కందునకు నమ
స్కారమ్మొనర్చి, తన్మత
మీరీతిని సుప్రసన్నకృతి గావింతున్. ౧

క. దేవసుతు శకమ్మున రా
మావనినందోర్వి వత్సరాంతమున*హిమా
నీవేళ ద్వాదశపునెల
నావింశతిమీఁద నవమియౌ దివసమునన్, ౨

క. ఎల్లరు శిష్యులు చెదరని
యుల్లముతోఁ గూరుచుండియుండఁగ, ఋషిరాట్
తల్లజు భగవంతుని నే
నల్లన నడిగితిని నిర్ణయప్రాప్తికినై. 3

---

* క్రీస్తుశకము 1913-వ సంవత్సరము.

## మొదటి ప్రశ్న

క. ఇది సత్య మసత్యంబని
మదిని బరామర్శ సేయు మాత్రనె మోక్షం
బొదవునె ? కాదేని బంధముఁ
జెదుపఁగఁ వేఱెద్దియైన సాధన మున్నే? ౪

## రెండవ ప్రశ్న

క. తలపోయఁగ జిజ్ఞాసుల
కిల ముక్తికి శాస్త్రచర్చయే చాలునె ? యొ
జ్జల యుపదేశము చొప్పున
వలయునె మోక్షార్థ మొక యుపాసన యెదియేని ? ౫

## మూఁడవ ప్రశ్న

క. ఆపూర్ణత నెఱిఁగియొ, జ్ఞా
నోపరతమ్మునను జేసియో, భువిఁ దనుఁ దా
నేపగిది స్థితప్రజ్ఞుం
డోపు స్థితప్రజ్ఞుఁ డనుచు నొగి నేర్పఱుపన్ ? ౬

## నాలవ ప్రశ్న

క. ఏమి గుఱుతుచేఁ గోవిదు
లీమహి జ్ఞానిగను నొకని నెఱుఁగ వలంతుల్ ?

## ఐదవ ప్రశ్న

ఏమిా సమాధి యెఱుకకె ?
కామమునకునుం బ్రయోజకం బగునొక్కో ? ౭

## ఆఱవ ప్రశ్న

క. ఆసకయి యొకఁడు యోగముఁ
దా సాదనసేయుచో, స్థితప్రజ్ఞుఁడుగా
వాసిఁగను నేని, దొలుతటి
యాస యపుడు ఫలితమొందనౌనో, గాదో? ౮

క. ఈవిధమున నాప్రశ్నలఁ
దా విని, కరుణాపయోనిధానము సందే
హావచ్ఛేది రమణఋషి
వావిరి భగవానుఁడు గురువరుఁ డిట్లనియెన్. ౯

## మొదటిప్రశ్నకు ఉత్తరము

క. ఒక యాత్మనిష్ఠయే భువి
సకలమ్మగు బంధములను ఛేదుపఁగఁ జాలున్;
ఇఁక సత్యాసత్యవిమ
ర్శకతను వైరాగ్యమునకు సాధన మనుదుర్. ౧౦

క. జ్ఞాని యిల నాత్మయందే
తా నిలుకడఁ జెందెడిన్ సదా గంభీరుం
డై, నిఖిలజగ మసత్యం
బౌనని యోన్ దలపఁడు తన కన్యంబని యోన్. ౧౧

## రెండవప్రశ్నకు ఉత్తరము

క. ఏసిద్ధియు లేదు విజ
జ్ఞానువునకు శాస్త్రచర్చ సలుపుట మాత్రన్

వీసం బె, నిది నిజేమ యు
పాసన లేకున్న సిద్ధి ప్రాప్తింప దెటుల్. ౧౨

క. తన యభ్యాసపు సమయము
నను సహజస్థితి యుపాసనం బనం బరంగుఁ ;
వినిరూఢసిద్ధి యెప్పు డొం
దునో యపు డదె జ్ఞానమనుచు నుడువంబడెడిఁ. ౧౩

క. దూరీకరింప విషయము,
లారూఢిగ స్వస్వభావ మగు సంస్థితి సం
స్ఫార జ్ఞాన జ్వాలా
కారము సహజస్థితి యనంగాం బరంగు ధరఁ. ౧౪

## మూఁడవ ప్రశ్నకు ఉత్తరము

క. వాసన వాసిన మౌనము
చే సహజస్థితి కరమ్ము స్థిరమై తనరం
గా, నుంత సంశయింపక
తా సుజ్ఞాని గణియించుఁ దను జ్ఞానినిగాఁ. ౧౫

## నాలవ ప్రశ్నకు ఉత్తరము

క. నానా భూత సమత్వము
జ్ఞానము నూహింప గుఱుతు గా నగుఁ;

## ఐదవ ప్రశ్నకు ఉత్తరము

గామం

బూని సమాధిం గొను నెడఁ
దా నిక్కముగా ఫలించుఁ దత్కామ మిలఁ. ౧౬

## ఆఱవ ప్రశ్నకు ఉత్తరము

క. ఆసకయి యొకఁడు యోగముఁ
దా సాదన సేయుచో స్థితప్రజ్ఞుఁడుగా
వాసి గనునేని, దొలుతటి
యాస ఫలించినను గాంచఁడతఁడు ముదమ్మున్. ౧౭

ఇటులు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠగణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును అగు
శ్రీ రమణ గీతలయందు
**ఉపాసన ప్రాధాన్య నిరూపణము**
అను మొదటి యధ్యాయము.

# ద్వితీయాధ్యాయము

## మార్గత్రయ కథనము

క. దేవసుతు శకమ్మున బా
ణావనినందోర్వ్యేట*నల చాతుర్మా
స్యావధి భగవానుఁడు ఋషి
యీవిధి సారమ్ము సంగ్రహించుచుఁ బలికెన్. ౧

శ్లో॥ "హృదయకుహరమధ్యే కేవలం బ్రహ్మమాత్రం
హ్యహమహమితిసాక్షా దాత్మరూపేణ భాతి;
హృది విశ మనసా స్వం చిన్వతా, మజ్జతా వా,
పవనచలనరోధా దాత్మనిష్ఠో భవ త్వం." ౨

క. అనుచును మహర్షి భగవా
నుని నోటను బయలువడిననుడి నీశ్లోక
మ్మును వేదాంతసుసారం
బు నెవఁ డెఱుఁగు, శంక యెపుడుఁ బొడమ దతనికిన్. 3

---

* క్రీస్తుశకము 1915 వ సంవత్సరము.

♦ ఈ శ్లోకమునకు తెలుఁగు అనువాదము.

చ. హృదయగుహాంతరమ్మున నిదే వెలుఁగున్ గద 'నేను నే' నటం,
చెదుటను నాత్మరూపముగ నే యల బ్రహ్మమె కేవలమ్ము; తన్
వెదకుచో మున్గుచో తనరు నెమ్మదిలోఁ జొరఁ బ్రాణమా హృదిన్,
కదలక యాత్మనిష్ఠుఁడవు గమ్ము మరుచ్చలనమ్ము నిల్పుటన్.

క. ఈరిత మీశ్లోకపుఁ దొలి
యారెండుం బాదముల మహర్షి ముఖమునన్
శారీరకస్థలమ్ము దృ
గారోహిత పాంచ భౌతిక శరీరమునన్. ౪

క. దాననె లక్షణ ముక్తము,
దాననె జీవేశభిన్నతయునుం దొలఁగెన్,
నానాలింగనిబర్హణ
మానపరోక్షతయుఁ గూడ నవగత మయ్యెన్. ౫

క. ఉపదేశమయ్యెను ద్వితీ
యపు సగమున శిష్యజనుల యభ్యాసముకై
త్రిపథములను భిన్నము త
త్త్వపుఁ జూడ్కిని నేక మగు విధానము దానన్. ౬

క. ఆ మూఁటఁ దొలియుపాయము
నామము మార్గణము, మజ్జనము రెండవ దౌ,
ఆ మీఁదఁ బ్రాణరోధన
మా మూఁడవది సదుపాయ మని యెన్నఁబడెన్. ౭

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠగణపతి
గ్రథితమును వేంకట సుబ్బరామానువదితమును
అగు శ్రీ రమణ గీతలయందు
**మార్గత్రయ కథనము**
అను రెండవ యధ్యాయము

# తృతీయాధ్యాయము

## ముఖ్య కర్తవ్య నిరూపణము.

క. గురువగు రమణునకును దై
వరాతునకు జరగినట్టి వరసంవాదం
బు రచితము మనీషాఢ్యుల
హరుసముకై యీ తృతీయమగు భాగమునన్. ౧

## దైవరాతుని వాక్యము.

క. మనుజున కీ సంసారం
బునఁ గర్తవ్యము ప్రధానముగ నెయ్యది, దా
నిని, భగవానుఁడ, యేక
మ్మును నిర్ధారించి నాకు బోధింపఁగదే. ౨

## భగవానుని వాక్యము.

క. పనులకు ఫలముల కన్నిటి
కిని జొప్పడు సుప్రతిష్ఠ కేవల మెట నా
తనదు స్వరూపము మహది
చ్చున కత్యంతప్రధానసుజ్ఞేయ మగున్. ౩

## దైవరాతుని వాక్యము.

క. ఏయది స్వరూప మెఱుఁగను
పాయము క్లుప్తముగఁ దనకుఁ, బలుకుము దానిన్;

ఏయత్నము సేయుటను మ
హీయము ప్రత్యక్షమౌ నఖిల సిద్ధించున్ ? ౪

భగవానుని వాక్యము.

క. దొరకొని సమస్తవృత్తుల
మరలిచి విషయములనుండి, మానక యెపుడున్
ధరఁ గేవల మ్మచంచల
నిరుపాధి విమర్శయందు నిలువఁగవలయున్. ౫

క. ఈయదె స్వస్వరూప మెఱుఁగ ను
పాయము క్లుప్తముగఁ దనకు భావింపంగాన్;
ఈయత్నము సేయుటనె మ
హీయము ప్రత్యక్షమౌ నఖిల సిద్ధించున్. ౬

దైవరాతుని వాక్యము.

క. ఎందాక నరుల యోగము
పొందునొ పరిపూర్ణసిద్ధి, మునికుంజరమా,
యందాక ప్రయత్నమ్మున
కుం దోడుపడం గలుగునొకో నియమమ్ముల్ ? ౭

భగవానుని వాక్యము.

క. క్షితి యుంజత్సుజనమ్ముల
చేతనమునకుఁ దోడుపాటు సలుపు నియమముల్ ;
కృతకృత్యులైన సిద్ధుల
కతుకకొనక నియమములు స్వయమ్ముగ జాఱున్. ౮

## దైవరాతుని వాక్యము

క. స్థిరనిరుపాధివిమర్శ నె
ధర నెట్టులు సిద్ధి యొదవుఁ, దద్విధమున నే
నరులకు మంత్ర జపమ్ముల
నరయంగాఁ బరమసిద్ధి యగునో కాదో? ౯

## భగవానుని వాక్యము.

క. స్థిరచిత్తముతోడ నిరం
తరముగ మంత్రజపముల నొనర్చుట నేనిన్,
నిరతము ప్రణవజపమ్మును
జరపుట నే నొదవు సిద్ధి శ్రద్ధాళులకున్. ౧౦

క. పాయక మంత్రములో శు
ద్ధాయితమౌ ప్రణవమో సతతము జపమ్మున్
జేయుటచే విషయమ్ముల
రోయఁ గలుగువృత్తి స్వస్వరూపాత్మ యగున్. ౧౧

క. దేవసుతుశకమ్మున శై
లావని నందోర్వి వత్సరాం*తరమందున్
వావిరి సప్తమినెల నే
డౌవాసర మిద్ధిగోష్ఠి యరిదిగ జరగెన్. ౧౨

---

* క్రీస్తుశకము 1917-వ సంవత్సరము.

ఇటులు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠగణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును
అగు శ్రీ రమణగీతలయందు
ముఖ్యకర్తవ్య నిరూపణము
అను తృతీయాధ్యాయము.

# చతుర్థాధ్యాయము

## జ్ఞానస్వరూప కథనము.

### మొదటిప్రశ్న

క. జ్ఞానమ్మెది, మునికుంజర,
యే నగుదుం బ్రహ్మమనెడు వృత్తియొ. బ్రహ్మం
బే నను బుద్ధియొ, సర్వం
బే నను బుద్ధియొ ? మహాత్మ, యెఱిఁగింపఁగదే. ౧

క. సకలమునిది బ్రహ్మం బను
బోకొ యిల జ్ఞానమ్ముగాఁ బ్రయుక్తము ? పైఁ బే
రుకొనిన వృత్తులు నాల్గిం
టి కంటెనుర్ జ్ఞాన మరయ నెగడునె వేత్తై ? ౨

### ఉత్తరము

క. తనశిష్యుఁడ నగు నే నడి
గినట్టి యీ ప్రశ్నఁ దా నొగిన్ సాదరుఁడై
విని. గురువు మౌని రమణుఁడు
పనివడి భగవానుఁ డిట్లు ప్రతివచియించెన్. 3

క. ఈ వృత్తులు సకలమ్ములు
భావనలే, సందియమ్ము పని లేదు, స్వరూ

పావస్థితి శుద్ధమ్మును
గోవిదు లిల జ్ఞానసంజ్ఞఁ గొని వచియింతురా. ౪

## రెండవప్రశ్న.

క. ధర సందియముఁ దొలఁచు త
ద్గురువాక్యము వినియు పురలఁ దోడ్తోడనె యం
కురితము సందియ మన్యము
గుఱించి యంత నిటు లడిగికొంటిని గురువుఁ. ౫

క. వ్యాపృతమగునా, కాదా,
తాపసపతి, వృత్తిచేతఁ దద్బ్రహ్మము? ప్రా
ప్త్యాప్తిపిత మీా నా సంశయ
మేపగిదిఁ జేనునో యట్టు లేర్పడఁ జెపుమా. ౬

## ఉత్తరము.

క. ఋషి యీా ప్రశ్నవిని, చరణ
ఋషులకు మిత్త్రమును నన్ను సొంపొలయంగా
సుషమకటాక్షముచేత న
భిషేకము సలుపుచు, నిట్లు ప్రీతిఁ బలికెఁ. ౭

క. తనయాత్మ బ్రహ్మముఁ దెలిసి
కొన వృత్తి మెలంగునేని గొనకొని, యావే
శను స్వాత్మాకారగ నా
మేను, నిలఁబడ దాత్మకన్న నుంతయు వేత్తై. ౮

క. పైనుడివిన యేటనె యే
డౌనెల మా కిరువదొక్కటగు దివసమునన్
దా నడచె మితగ్రంథం
బౌ నీ సంవాదము పులకాంకుర మొదవన్. ౯

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠగణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును
అగు శ్రీ రమణగీతలయందు
జ్ఞానస్వరూప కథనము
అను చతుర్థాధ్యాయము.

# పంచమాధ్యాయము

## హృదయ విద్య.

క. మును నుడివిన వత్సరమున
నెనిమిదవ నెలఁ నవమి యయిన దినమున రే
యిని హృదయమ్మును గూరిచి
ముని యుపదేశము సమగ్రముగ నొనరించెఁ ౧

క. ఏకడ నుండియె వృత్తులు
సాకల్యము బయలువెడలి సాగునొ, పేరుం
గైకొను నది హృదయంబని;
యాకారపు వర్ణన మరయఁగ భావనయే. ౨

క. నానావృత్తుల మూలం
బే నను వృత్తియె యటంచు నెన్నంబడెడిఁ:
నే నను బుద్ధియు నెచ్చటఁ
దాను బయలువెడలు నదె హృదయ మొకమాటఁ. 3

క. హృదయమ్మునకును స్థాన
మ్మది చక్ర మనాహతాఖ్య మగునేఁ మఱి యే
ల దివిరి మూలాధారము
మొదలిడి యోగమ్ము తరలు పోడిమి ధరణిఁ? ౪

క. ఆరక్తపిండమునకున్
వేఱుగు నదియే హృదయము; వృత్తి "అయంహ్మా"
త్తారయఁగా నగుటను దా
నీరిత మది యాత్మరూపమే యని సరిగాన్. ౫

క. కుడివైపున నున్నది యది
యెడమ వయిపునందుఁ గాదు హృత్పీఠిని; న
క్కడనుండి జ్యోతి పాఱును
సుడీ సహస్రారమున సుషుమ్నా సరణిన్. ౬

క. పాఱును మే నెల్ల సహ
స్రారమునుండి; యపుడు జగదనుభవము లగున్;
వేఱుగ వానిం గని సం
సారి యగుచునుండుఁ జుమ్ము మానవుఁడు మహిన్. ౭

క. అగు శుద్ధము జ్యోతిర్మయ
ముగ నాత్మస్థునకు నిరతము సహస్రారం;
బాగి సంకల్పము జీవిం
చఁగన దటంబడి తదీయ సాన్నిధ్యమునన్. ౮

క. తెలియుచు నున్నను విషయము
కలయంతయుఁ దాను సన్నికర్షముచేతన్,
దలఁపు గొనదేని భేద,
మ్మిలఁ గలుగదు యోగభంగ మెంతయు నెపుడున్. ౯

క. కైకొనుచును విషయమ్ముల
స్వైకము స్థిరమైన బుద్ధి సహజస్థితినా

వాకొండ్రు; విషయ సన్నిధిఁ
బోకున్నది నిర్వికల్పము సమాధి యగున్. ౧౦

క. ఉండును నిశ్శేషముగా
నండము మెయి; మేనును హృదయమున సమస్తం
బుండును; దానివలన స
ర్వాండమునకు రూపసంగ్రహము హృదయమ్మా. ౧౧

క. మనమున కన్యము గాదు భు
వనము; మనము హృదయమునకు వాస్తవముగ వే
అనఁగాదు; గానఁ గథ యె
ల్లను హృదయమ్మున సమాప్తి లలిఁ బ్రాపించున్. ౧౨

క. అండమున భానుమండల
ముండు పగిదిఁ బిండమందునొప్పఁగ హృదయం
బుండును; శశిబింబమువలె
నుండు సహస్రారగతము నొగి మానసమున్. ౧౩

క. కైరవ బాంధవునకుఁ దా
నా రవి తేజమ్ము నెట్టు లలయక యిడునో
యారీతి జ్యోతి నొసఁగున్
వారక యీమానసమ్మునకు హృదయమ్మున్. ౧౪

క హృదయ మసన్నిహితముగాన్
మదినే గేవలముఁ దాను మర్త్యుఁడు చూచున్,
జేదలన్ రవి గ్రుంకఁగ రే
గదిరి పరువునట్టి చంద్రుకాంతిని బోలెన్. ౧౫

క. కనకయె తేజోమూల
మ్ము నిజే మ్మాత్మ స్వరూపమును, మదిచేతన్
గనుచును వేఱుగ భావము
లను,నిట్టులు పామరుం డిలన్ నశియించున్ *. ౧౬

క. జ్ఞాని హృదయసన్నిహితుఁడు
దా నీక్షించును సదా హృదయ తేజములో
లీనము మానస తేజము,
భానునిలోఁ బగలు చంద్రు భాసముఁబోలెన్. ౧౭

క. జ్ఞానమునకు వాచ్యార్థము
మానసమని నుడువుచుంద్రు మహి విద్వాంసుల్;
దానికి లక్ష్యార్థము హృది
యహా ; నుండఁడు హృదికిని బరుఁడగు పరుఁడెందున్. ౧౮

క. ఇల దృక్కు దృశ్యమనఁగా
నెలకొను నీ భేదబుద్ధి నెమ్మనమునఁ. ని
చ్చలు హృదయము లోపల వ
ర్తిలు వారల కైక్య మాను దృగ్దృశ్యమ్ముల్. ౧౯

క. అతి సంతోష విషాదా
యతి భీతి సుషుప్తి మూర్ఛనాది నిమిత్తా
హత మగు నట్టితఱిన్ వృ
త్తి తనదు తావగు హృదిం బదిలముగఁ జేరున్. ౨౦

---

* భ్రమియించున్ అని పాఠాంతరము.

క. తెలియంగారాదు శరీ
రుల కవ్వేళ హృదయాప్తి, రూఢిగఁదెలియం
గలుగు సమాధినొ, నామ
మ్ముల భేద మొదవు నిమిత్తముల భేదముచేన్. ౨౧

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ గణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును
అగు శ్రీ రమణగీతలయందు
**హృదయవిద్య**
యను పంచమాధ్యాయము.

# షష్ఠాధ్యాయము

## మనోనిగ్రహోపాయము.

క. హృదయంపుఁ దత్త్వ మిట్టులు
విదితము గావించి తత్త్వవిద్వన్మణి మా
ని దయాంభోనిధి రమణుఁడు
మదినిగ్రహముం బొనర్చు మార్గము నుడివెన్. ౧

క. అనవరతవ్యాపృతియుతు
లును విషయాసక్తచిత్తులు నగు నరుల వా
సనలు బలీయములగుటను
మనస్సు దుర్నిగ్రహమగు మానక యవనిన్. ౨

క. చంచల మగునట్టి మన
మ్మంచితముగ నిగ్రహింపనగుఁ బ్రాణము రో
ధించినచోఁ; ద్రాడున బం
ధించిన పశువువలె మనము నిశ్చేష్టమగున్. ౩

క. అల ప్రాణనిరోధముచే
నలవడు వృత్తుల నిరోధ, మత్తెఱఁగున వృ
త్తులను నిరోధింపఁగ వృ
త్తుల జన్మస్థలిని సుస్థితుఁడు మనుజుఁడగున్. ౪

క. మానసముచేతఁ జెల్చెడు
ప్రాణంపుం బ్రత్యవేక్ష ప్రాణనిరోధం
బౌ; నిటులు ప్రత్యవేక్షణ
గా నెల్లప్పుడును, కుంభకము సిద్ధించున్. ౫

క. ఈ నెఱిఁ గుంభకమొందఁగ
నే నరు లెన్నంగ శక్తిహీను లగుదురో
ఆ నరులకు హఠయోగ వి
ధానమ్మునఁ గుంభకమ్ము దా నేర్పడెడిన్. ౬

క. ఒకపరి నొనర్పఁదగు రే
చక, మొకపరిఁ బూరకమ్ము సలుపంజెనుఁ, గుం
భక మిఁక నలుమాఱులు; త
క్కకటులు నాడీవిశుద్ధి కలుగును దానన్. ౭

క. అమలములగుచో నాడులు,
క్రమమ్ముగాఁ బ్రాణము నరికట్టఁగనగు; నె
ట్టిమెయిం బ్రాణంపు నియమ
నము శుద్ధము కుంభకమ్మనం జెను నవనిన్.

క. జ్ఞాను లనియెదరు, దేహము
తా నను భావము వదలుట ధర రేచకమౌఁ,
దా నరయుట తనుఁ బూరక
మౌ, నలకుంభకము సహజమౌ స్థితి యనుచున్. ౮

క. ఆ నామమంత్రజపమున
మానసనిగ్రహము లభ్యమానంబగు; న

మ్మానసముచేత నప్పుడు
ప్రాణముతో మంత్రమునకు నైక్యము పొసఁగుఁ. ౧౦

క. ప్రాణము మంత్రాక్షరముల
కౌ నైక్యము ధ్యానమనుచు నవనిం బరఁగుఁ;
ధ్యానము గానునేని దృఢ
స్థానము, నద్ది యొదవించు సహజస్థితినిఁ. ౧౧

క. అహరహ మారూఢమతుల్
మహితులు సన్మార్గులైన మనుజులతోఁ డఁ
సహవాస మొనర్చుటచే
సహితము మది లీనమగును స్థానము నందుఁ. ౧౨

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ
గణపతి గ్రథితమును వేంకటసుబ్బరామాను
వదితమును అగు శ్రీరమణగీతలయందు
మనోనిగ్రహోపాయము
అను షష్ఠాధ్యాయము

# సప్తమాధ్యాయము

## ఆత్మ విచారాధికారి తదంగ నిరూపణము

క. భారద్వాజపుఁ గార్ష్ణికి
శ్రీ రమణాచార్యులకు జరిగినట్టిది బల్
సారతరము సంవాదము
వ్యారచిత మ్మిటను స_ప్తమాధ్యాయమునన్. ౧

### కార్ష్ణి వాక్యము

క. ఈ యాత్మ విచారమునకు
నేయది రూప? మెది ఫలిత? మీయాత్మవిచా
రాయతఫలమునకన్నను
భూయము ఫల మన్యరీతిఁ బొందఁగనగునే? ౨

### భగవానుని వాక్యము

క. దేనిని సమస్తవృత్తుల
కైనట్టి సమష్టియనుచు ననెదరొ, యా యీ
'నే'నను వృత్తికి జన్మ
స్థానమును విమర్శసేయ దగు నెయ్యెడలన్. 3

క. ఇదె యాత్మవిచారం బను
నది; శాస్త్రమ్ముల పరీక్ష యది గాదు సుమా;

వెదకఁగ మూలస్థానము,
నదాటున నడంగి చేను నహంవృత్తి యిలన్. ౪

క. ఆత్మాభాస మహంకృతి
యాత్మను దా నెప్పు డణఁగు, నప్పుడె చేనఁగా
నాత్మానాత్మవిభేదం,
బాత్మయొకటె మిగులుఁ బూర్ణమై సత్యమ్మై. ౫

క. ఇల నాత్మ విచారమునకు
ఫల మాయాసమ్ము లెల్లఁ బాయుటె; యిదియే
ఫలములకన్నింటి కవధి;
కలుగు టసంభవ మితోఽధికము ఫలమెందున్. ౬

క. ఇతరోపాయమ్ముల న
ద్భుతములు సిద్ధులెవి సాధ్యములగునో, యవి ప్రా
పితమయ్యు, నరుండగు ని
ర్వృతుఁడు విచారమ్ముచేతనే యంత్యమునన్. ౭

## కార్ష్ణి-వాక్యము

క. ఈ యాత్మ విచారమ్మున
కేయతఁ డధికారి యనుచు నెన్నంబడుఁ? దా
నై యధికారపుఁ గలిమిని
బాయక యెఱుఁగంగ సాధ్యపడునా యెటులేన్? ౮

## భగవానుని వాక్యము

చ. ఎవనిమనం బుపాసనలనేని పురాకృతపుణ్యసంపదా

_ప్తివలననేని శుద్ధమయి, దేహమునఁ విషయమ్ములందుఁ
[దాఁ
బ్రవిదిత దోషమహా, మనసుఁబట్టి చరించెడు వేని కెంతయే
నవు విషయానపేక్ష, తనుహానితలం, పధికారి వాఁడగుఁ.
[౯, ౧౦

క. తనువు నశియించునను బు
ద్ధిని, విషయమ్ముల యెడఁ గదిరిన విరాగ
మ్మున, గుఱుతుల నీ రెంటను,
దను నధికారిగ నెఱుంగఁదగు నిక్క_ముగాఁ. ౧౧

## కాష్ణి-వాక్యము

ఉ. స్నానము, సంధ్యయుఁ, జపము,
స్వాధ్యయనమ్ము, సురార్చ, హోమముఁ,
దానముఁ, దీర్థయాత్రయు, వ్ర
తమ్ములు, యజ్ఞముఁ, గీర్తనల్, వివే
కాన విర_క్తిచేత నధి
కారి విచారమునం దెవండో య
వ్వానికి సత్ఫలంబిడున
వా? యటుఁగాకయె కాలహారులా? ౧౨, ౧౩

## భగవానుని వాక్యము

క. వైరాగ్యము వొడమ, విచా
రారంభమునందు నున్న యధికారుల కీ

పేరుకొనినట్టి కర్మలు
తా రన్నియుఁ జిత్తశుద్ధిఁ దద్దయు నొసఁగున్. ౧౪

క. సుకృతమని మనోవాక్కా
యకృతం బేకర్మ నుడువనగునో, యదివే
ఱు కుకర్మ మనోవాక్కా
య కరణజనిత మగుదాని హత మొనరించున్. ౧౫

క. అతిశుద్ధమతులు పరిప
క్వతనొందిన వారగు నధికారుల యీ క
ర్మతతి యుపయోగపడును జ
గతికి నిరంతర మహోపకార మ్మగుచున్. ౧౬

క. పరులకు నుపదేశమ్ము నొ
నరుచుటకుం బరులమేలునకును మనీషుల్
పరిపక్వులు కర్మలనా
చరింతు, రొనరింపరు విధి శాస్త్ర భయమునన్. ౧౭

క. సంగము విడి, భేదమతిం
భంగము గావించినట్టి మానవుఁ డొనరిం
పంగ సుకృతకర్మలు, నర
పుంగవ, గా వవి విచారమునకు విరోధుల్. ౧౮

క. పరిపక్వాత్మవిమర్శన
పరు లే కర్మముల నొనరుపక యున్నను బా
పరహితు; లాత్మవిమర్శయె
యురుపుణ్యముఁ, బావనముల నొగిఁ బావనమున్. ౧౯

క. ద్వివిధముల నిష్ఠగానఁగ
నవుఁ బరిపక్వాధికారులం దేకాంతం
బవు యోగమునకుఁ ద్యాగం,
బవనిఁ బరార్థమ్ము కర్మయం దాదరమున్.   ౨౦

### కార్ష్ణివాక్యము

క. ఈ యాత్మవిచారము గా
కే యన్యపథమ్ము కలుగునే ముక్తికి? నొం
డే యది, వివిధమె? తగు సెల
వీయఁగ నాకు భగవానుఁ డీ విషయమ్మున్.   ౨౧

### భగవానుని వాక్యము

క. ఒరుఁడు పోరయ యత్నించును;
పరుఁడు పోరయువాఁ డెవఁడని పరిశీలించున్;
చిర మేఁగి యేఁగి ప్రథముఁడు
పోరయంగాఁ గలుగు నంత్యమునయం దాత్మన్.   ౨౨

క. ఏకమ్మును ధ్యానింపఁగ
నేకాకృతియగును చిత్త, మేకాకృతిగా
నీకరణిఁ జిత్తమునకున్
సాకల్యముగా స్వరూపసంస్థితి కలుగున్.   ౨3

క. కోరకయే మనుజుఁడు సం
స్కారధ్యానమున నాత్మసంస్థితి నొందున్
ధారుణిలో, నిఁక నాత్మ వి
చారకుఁడో యెఱిఁగి యాత్మసంస్థితుఁడ యగున్.   ౨౪

క. దేవతయో మఱి మంత్రం
బో వేఱొక మేలిలక్ష్యమో ధ్యేయముగా,
నావస్తు వాత్మయన ఘన
మౌ వెలుఁగునఁ దాను లీనమగు నంత్యమునన్. ౨౫

క. ఈతీఱున గతి యేకమె
ధ్యాతయు స్వవిమర్శకుండు నను నిరువురకున్;
ఆతతశాంతిని గను నొక
యాతఁడు ధ్యానింప, నెఱిఁగి యన్యుం డణఁగున్. ౨౬

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ గణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును అగు
శ్రీ రమణగీతలయందు

**ఆత్మవిచారాధికారి తదంగ నిరూపణము**

అను సప్తమాధ్యాయము.

# అష్టమాధ్యాయము

## ఆశ్రమ విచారము

క. మునినాథుఁడు భగవానుఁడు
విని కాష్ణిన్యె యడిగినట్టి వేఱొక ప్రశ్న
మ్మును, జతురాశ్రమములఁ జెం
దిన యధికారమును దేటతెల్ల మొనర్చెన్. ౧

క. మహిఁ దాను బ్రహ్మచారియొ,
గృహియొ, వనప్రస్థుఁడో, యతీశ్వరుఁ డగునో,
మహిళయొ, వృషలుఁడో కాని,
రహిఁ బరిపాకమ్ము వొరయ బ్రహ్మము నరయున్. ౨

క. సోపానములవలె నగుం
బ్రాపింపఁగఁ బరము నాశ్రమక్రమ; మతి పా
కోపేతమనస్కునకుఁ గ్ర
మాపేక్ష తలంపఁగా ననావశ్య మగున్. 3

క. క్షితి జరగు కార్యములకున్
గతి యయ్యెడి నాశ్రమముల క్రమము; తదాద్య
త్రితయపు ధర్మము లరయం
బ్రతికూలముగావు జ్ఞానమార్గమ్మునకున్. ౪

క. విమల జ్ఞానమె సన్న్యా
సము; గాదది ముండనమ్ము సల్పుట, కాషా
యమును; బ్రతిబంధకస్తో
మము వారింపంగ నాశ్రమ మ్మేర్పడియెన్. ౫

క. వ్రతముల, విద్యను, జ్ఞానో
చ్ఛ్రిత, నెవ్వనిశక్తి బ్రహ్మచర్యాశ్రమ సం
స్థితి నుజ్జృంభించునో, య
ప్రతిహతముగ వెనుక నతఁడు ప్రజ్వలియించున్. ౬

క. ప్రవిమలము బ్రహ్మచర్యం
బవలంబించిన నరుఁడు గృహస్థత నమలుం
డవు; నెల్లర యుపకృతికే
యవని గృహస్థాశ్రమం బటందురు విబుధుల్. ౭

క. ధర సర్వవిధమ్ముల సం
గ రహితుఁడు గృహస్థుఁడయ్యుఁ, గరమతనికిఁ బ్ర
స్ఫురియించు జ్యోతి; దీనికిఁ
బరమాణువు సంశయమ్ముఁ బనిలే దెపుడున్. ౮

క. అవనిఁ దపమునకుఁగా మూఁ
డవ యాశ్రమ మేర్పడిన దటంద్రు బుధేంద్రుల్;
స్వవనిత వీడియొ, సవనితుఁ
డవుచునో, కొనఁదగుఁ దృతీయమా నాశ్రమమున్. ౯

క. మిగులక తపమునఁ బాపము
తగులంబడఁ బక్వచిత్తతను గాంచినవాఁ

డగుయోగికిఁ దఱితో స్వాయ
ముగనె చతుర్థాశ్రమమ్ము భువిసమకూడున్. ౧౦

క. మును నుడివిన యాయేటనె
యెనిమిదిటం బదియురెంటనే శ్రీభగవా
నుని యీ యుపదేశం బే
డెనిమిది యధ్యాయములది యిలఁ బ్రభవిల్లెన్. ౧౧

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ గణపతి గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును అగు

శ్రీరమణగీతలయందు

ఆశ్రమవిచారము

అను అష్టమాధ్యాయము

# నవమాధ్యాయము

## గ్రంథిభేద కథనము

క. పదునాల్గవ దినమున నేని
మిదవ నెలఁ రేయి బుధసమితికిని సందే
హదమైన గ్రంథిభేదము
విదిత మొనర్పవె యటంచు వేఁడితిని ఋషీ. ౧

క. ఆ నా ప్రార్థనవిని, భగ
వానుఁడు ఋషి రమణుఁడు భగవద్భావమునఁ
ధ్యానించి యించుక, మహా
మానసుఁ డతఁ డంత నిట్టిమాటలు పలికెఁ. ౨

క. తనువునకు నాత్మకును నో
య్యన నగు సంబంధమెద్ది యది గ్రంథియనం
జను; నాత్మకు సంబంధము
ననె యీ శారీరమైన జ్ఞానము కలుగుఁ. ౩

క. తనువు జడమేయగుట, చే
తనమే యాత్మయగుట విదితమె; యీ యుభయ
మ్మునకును సంబంధము సర
విని దా నిల నూహ్యమగును విజ్ఞానమునఁ. ౪

క. చైతన్యచ్ఛాయావృత
మై తనువు నటించుచుండు నవనీతలమం,
దో తంద్రీ, నిద్రాదుల
నాతగులము లేమి నూహ్య మాత్మస్థలి యా. ౫

క. అల సూక్ష్మవిద్యుదాదుల
కిల స్థూలపుఁ దంత్రులాది నెఱువ లెనో, యు
ట్టులె చైతన్యజ్యోతికిఁ
గళేబరపునాడియందు గతి యగుచుండున్. ౬

క. స్థలమొండాశ్రయముగ ను
జ్జ్వలమయి, దేహమ్మునెల్లఁ జైతన్య జ్యో
తి లలిన్ భాసిలఁ జేసెడి,
నిల నెల్లను భాస్కరుండు నెసఁగించు క్రియన్. ౭

క. దాని ప్రకాశము పర్వఁగ
మేనునఁ దా మనుభవములు మేకొనియెడిఁ; ద
త్స్థానమ్మునె విబుధులు వ
క్కాణించెదరు హృదయాఖ్య గల దానినిగాన్. ౮

క. నాడీశక్తి విలాసపుఁ
బోడిమిఁ జైతన్యకిరణపు గతి యగుఁ; బృథ
ఙ్నాడుల నాశ్రయము గొనున్
వీడక దేహంపు శక్తివిసరమ్మెల్లన్. ౯

క. ఇఁకఁ జైతన్య మమరు వే
ఱొక నాడి; సుషుమ్న యనుచునుందురు దానిన్;

ఒక కొండ దాత్మనాడి య
నుకొంద్రు; పర యమృత యనుచు నుడువుదు రితరుల్. ౧౦

క. తనువెల్లఁ దత్ప్రకాశం
బనయముఁ బర్వంగ, జీవుఁ డభిమానము నొం
దినవాఁడై తలఁచును దను
వు నాత్మయని, భువి వేఱువున్ దన కనియున్. ౧౧

క. ఈ యభిమానమ్మును దను
వే యాత్మయనెడు తలంపు నెడలింపుచు, స
ద్ధీయుతుఁ డేకాగ్రతఁ దల
పోయఁగ, నాడులకు మథనము ఘటిల్లు నిలన్. ౧౨

క. ఈవగ నాడీమథనము
చే వానికి నాత్మ వేఱుసేయంబడుచున్
గేవల మమృతపు నాడి నె
తా వీడక యాశ్రయించి తద్దయు వెలుఁగున్. ౧౩

క. చైతన్య జ్యోతి సము
జ్జాతప్రభ యాత్మనాడి సంశ్రయమున నే
ద్యోతింప, నాత్మ కన్యం
బా తటి నెట్టిదియు నేని నగపడకుండున్. ౧౪

క. సాన్నిధ్యమున నెదేఁ గను
గొన్న, నది పృథగ్విధమ్ముఁ గొనకుండెడి; ని
ట్లున్నతఁ డాత్మ నెఱుంగును
బన్నగఁ, దన తనువుఁగాంచు పామరునిక్రియన్. ౧౫

క. పామరునకు రూపాదులు
తా మగుపడులీల నాత్మ తానే యెందున్
లో మఱి వెలుపల నెవనికిఁ
దా మెఱయును గ్రంథిభేది తథ్యం బతఁడే. ౧౬

క. ఔ నాడీబంధము నభి
మానము నని రెండుగన్ సుమా గ్రంథు లిలన్;
ఆ నాడీబంధముచేఁ
గానం దగు సూక్ష్మమయ్యుఁ గల స్థూలమ్మున్. ౧౭

క. మఱి యెల్ల నాడులను విడి
మరలుచు నొక నాడినే సమాశ్రయమగు న
త్తరుణమున జ్యోతి గ్రంథుల
సరవిన్ భేదించి యాత్మసంస్థితి నొందున్. ౧౮

క. అనలమునఁ గ్రాఁగినట్టిది
యినుపం జిట్టెమ్ము దోఁచు నె ట్లనలమయం
బన, నట్టులె స్వవిచారపు
టనలమ్మునఁ గ్రాఁగ, స్వ మయమయ్యెడు నిదియున్. ౧౯

క. అప్పుడు దేహాది జుషము
లప్పూర్వపు వాసనలు క్షయం బయిపోవున్;
ఎప్పగిదిన్ గర్తృత్వము
చొప్పడ దాత్మ, కది దేహ శూన్యం బగుటన్. ౨౦

క. చొప్పడమిని గర్తృత్వము,
చెప్పఁబడినయది కర్మచే టాత్మ కటం,

చిప్పడమిని వస్త్వంతర
మెప్పాటను లేమిఁ, గలుగ వేసందియముల్. ౨౧

క. ఒకమాఱు గ్రంథిఁ ద్రెంపిన
సుకృతుఁడు మఱి బద్ధుఁడౌట చొప్పడ దెపుడున్;
ప్రకటతమశక్తి యీస్థితి;
సకలోత్తమమైనయట్టి శాంతియు నిదియే. ౨౨

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ గణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును అగు
శ్రీరమణగీతలయందు
గ్రంథిభేద కథనము
అను నవమాధ్యాయము

# దశమాధ్యాయము

## స ం ఘ వి ద్య

క. శ్రీ యోగనాథనామకుఁ
డౌ యతికి రమణమహర్షి కగు సంవాదం
బీ యదనున నీ దశమా
ధ్యాయంబున సంఘహార్దముగ రచింతున్. ౧

### యోగనాథుని వాక్యము

క. ఒక సాంఘికునకు సంఘము
నకు సంబంధమ్ము, మౌనినాయక, యెది? లౌ
కిక సంఘపుఁ గల్యాణము
నకునై తెల్లముగ దీని, నాథ, నుడువవే. ౨

### భగవానుని వాక్యము

క. ఇల నయ్యయి యాచారం
బుల వారల కగు శరీరముంబలె సంఘం;
బలరుదురు దాని కంగం
బులవలె సాంఘికులు, సాధుభూషణ, వింటే. ౩

క. ఏ రీతి నవయవం బుప
కారమ్ము శరీరమునకుఁ గావించు, యతీ,
ఆ రీతి సంఘమున కుప
కారి యయిన సాంఘికుండు కడు జయమొందున్.

క. మనుజుఁడు సంఘోపకృతిఁ
మనోవచఃకాయముల నమర్చుచు నెపుడున్
దన యాచరణమ్మునఁ, దన
జనమును సైతమ్ము తనకుఁ జేను మేల్కొలుపన్. ౫

క. తనకులమును సంఘమ్మున
కనుకూలముగాఁ గుదిర్చి, యాపయి సంఘ
మ్మునకు సిరిం గూర్చుటకే
పోనరుపవలయున్ గులమును భూతియుతముగాన్. ౬

## యోగనాథుని వాక్యము

క. కొనియాడుచుందురు శాం
తిని గొందఱు లోకమున మనీషులు, మఱి శ
క్తిని గొందఱు; రెంటను నే
గొన మధికము సంఘశుభముఁ గూర్పఁగ, మానీ? ౭

## భగవానుని వాక్యము

క. స్వమనశ్శుద్ధికి శాంతియుఁ,
దమ సంఘప్రవృద్ధికొఱకు ధర శక్తియుఁ బ్రో
క్తము; శక్తిని సంఘము ను
చ్చమొనర్చి, యటుపయి శాంతి స్థాపింపవలెన్. ౮

## యోగనాథుని వాక్యము

అవని సకల సంఘపు మా
నవ సముదాయమ్ముచేత నానావిధులన్

దివిరి పడయంగఁ దగు నె
క్కువ ఫలిత మ్మెయ్యది? ఋషికుంజర, చెపుమా. ౯

## భగవానుని వాక్యము

క. ధరణిఁ గల సకల సంఘపు
శరీరుల సమిష్టిచేత సమభావమునన్
బూరయఁ దగు వరఫలము సు
స్థిర సౌభ్రాత్ర మ్మటంచుఁ జెప్పఁగవలయున్. ౧౦

క. తమ యన్యోన్యపు సౌభ్రా
త్రముచే నగు మహితశాంతి తనుధారుల, కా
సమయమున భూమియెల్లను
సమధికముగ నేకగృహము చాడ్పునఁ దనరున్. ౧౧

క. పదునేనవదినమున నె
న్నిదిటుల్ యతియోగనాథునికి వాత్సల్యా
స్పదుఁడగు రమణమహర్షి కిఁ
గదిరెన్ సంవాద మిది యఖండిత ఫణితిన్. ౧౨

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ గణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును అగు
శ్రీ రమణగీతలయందు
**సంఘవిద్య**
యను దశమాధ్యాయము

---

# ఏకాదశాధ్యాయము

ఉ. అంతట షోడశంపు దిన
మంతమునొందఁగ రాత్రివేళ నే
కాంతమునన్ మునీశు నిర
తాత్మసుసంస్థితు బ్రహ్మవేత్తలం
దంతయు శ్రేష్ఠు దివ్య గురు
వ్యాజనరున్ రమణర్షి డాసి సు
స్వాంతముతో నుతించితి న
శక్యపు జ్ఞానము నొందఁ గోరుచున్. ౧-౨

క. నీయందె పరమనిష్ఠయు,
నీయందే విశదమతియు నెలకొనె, నారా!
తోయమ్మున కంభోనిధి
చోయను, విజ్ఞానమునకు స్థానమ వీవే. ౩

క. పదియేడవ యేటనె బా
ల్య దశనె యోగిజనములకు నైనను గనఁగా
నొదవని విజ్ఞానమ్మును
దుదిఁదాఁకను గొంటివౌర! తోరపుఁ గీర్తిన్. ౪

క. ఈ నిఖిల దృశ్యభావము
లేనియున్ ఛాయరూపులే యైనవా యా

నీ నిష్ఠామహిమను, భగ
వానుఁడ, యెవ్వానితరము వర్ణనసేయన్! ౫

క. ధారుణి ఘోరంబగు సం
సారములో మునిఁగి, యొక్క చిక్కని నిలువన్
నేరక, ఘనదుఃఖాంబుధి
పార మరయు వారి కేకపరగతి వీవే. ౬

క. లలి దేవదత్త దృష్టిని
బలుమరుఁ గన్గొనుచునుందు బ్రహ్మణ్యులలో
పల నుత్తముఁగ, నరాకృతి
గల సుబ్రహ్మణ్య దేవుఁగా, బ్రహ్మ, నినున్. ౭

క. లే వీవు స్వామిమలపై;
లేవు క్షణిక పర్వతమున; లే వో నాథా,
ఆ వేంకట శైలముపై;
నీవు గలవు వాస్తవముగ నియ్యరుణాద్రిన్. ౮

క. నిను శుశ్రూషించుచునుం
డిన నారదఋషికిఁ దొల్లి నీ వుపదేశం
బొనరించితివి రహస్యం
బన నొప్పెడు భూమవిద్యనంతయు, నాథా. ౯

క. నిను నల సనత్కుమారుం
డను బ్రహ్మర్షియె యటందు రా వేదవిదుల్;
నిను మఱి సుబ్రహ్మణ్యుం
డను సురపుంగవుఁ డటందు రాగమవేత్తల్. ౧౦

క. కేవలము నామభేదమె,
యావంతయు వ్యక్తిభేద మమరదు దీనన్;
ఔ వాస్తవముగ నీ కిరు
మైవడిఁ బేరులె సనత్కుమారస్కందుల్. ౧౧

క. పూర్వము కుమారిలుం డను
నుర్వీసురసత్తముఁడుగ నుండియు, నాథా,
సర్వము వైదిక ధర్మము
నుర్విని స్థాపించినాఁడ వొప్పుగ నీవే. ౧౨

క. జైనులు ధర్మము జెఱుపఁగ,
స్థానము ద్రవిడముగ జ్ఞాన సంబంధుఁడవై
మేనుంగొని, భక్తిని భగ
వానుఁడ, స్థాపించినట్టి వాఁడవు నీవే. ౧౩

క. ఇప్పుడు శాస్త్రజ్ఞానము
చొప్పడుటనె తనియువారి సోకున వైపుం
దప్పిన బ్రహ్మజ్ఞానము
నిప్పుడమిని గావవచ్చి తీవు, మహాత్మా. ౧౪

క. పలు సందియమ్ములను శి
ష్యులకుం దొలఁగించినావు సులువుగ, నాథా,
అలయక యట్టులె నా మదిఁ
గల యీ సందియముఁ దీర్పఁగాఁ దగు నీకున్. ౧౫

క. జ్ఞానమ్మునకును సిద్ధుల
కౌనె పరస్పరవిరోధ? మటుఁగాక మఱే

దేనియు సంబంధము కను
గో నానే రెంట? మానికుంజర, చెపుమా. ౧౬

క. నే నిటు సన్నుతిపూర్వము
గా నడిగిన ప్రశ్న వినుచు, గంభీరముగాఁ
దా నీక్షించి, రమణభగ
వానుఁడు ననుఁ గూర్చి యిట్టివాక్యముఁ బలికెన్. ౧౭

క. సహజస్థితి నారూఢుఁడు
సహజముగనె దినదిన మ్మశక్యపుఁ దపమున్
వహియించెడి నాలస్యము
సహజస్థితియందుఁ గలుగఁజాలదు లవమున్. ౧౮

క. భువి నాత్మయందు సహజం
బవునిష్ఠయె యలవిగాని దనఁదగుతప; మా
యవిరత తపస్సుచే సం
భవమ్మగు క్షణక్షణమ్ముఁ బరిపాక మొగిన్. ౧౯

క. పరిపాకముచే సిద్ధులు
బొరయున్ గనువానిఁ గాలమున, నో తండ్రీ;
ధరఁ బ్రారబ్ధమ్మున్న, వి
హరించు వానిఁ గాని జ్ఞానియైన యతండున్. ౨౦

క. అరయఁగ మునికిఁ బ్రపంచము
స్వరూపమునకన్న భిన్నసరణిఁ గానని య

క్కరణిగనె, స్వరూపమున కి
తరములు గాఁ దోఁచవట్లుఁ దలకొను సిద్ధుల్. ౨౧

క. ఇల నెవనికిఁ బ్రారబ్ధం
బు లేదో, యా మాని శక్తిపూర్ణుండయ్యున్
జలియింపం డిసుమంతయు,
అల లించుక యేని లేని యంబుధివోలెన్. ౨౨

క. ధర నన్యమార్గమును దా
నరయండు నిసర్గముగనె యాత్మస్థితుఁ డౌ
నరుఁ; డీ శక్తు లివన్నియు
సరవిం గూడిన సమష్టి స్వాత్మస్థితియే. ౨౩

క. జతనము లేని తపమ్మో
క్షితి సహజస్థితి యటంచుఁ జెప్పుదురు బుధో
న్నతులు; సహజస్థితిని బ
క్వతవలనన్ శక్తు లుద్భవమ్మగుఁ జుమ్మా. ౨౪

క. తనుఁ బలువురు చుట్టుక యు
న్నను సత మాత్మస్థితుం డొనర్చునే యుం
డును ఘోరతప; మ్మతనికిఁ
బనిలే దేకాంతవాసపరత ధరిత్రిన్. ౨౫

క. జ్ఞానమ్మో శక్త్యపేత
మ్మోనని తలపోయు నాతఁ డెఱుఁగని వాఁడే;
జ్ఞానిసకల శక్తియుతం
బై నిండిన స్వస్వరూపమం దుండుఁ గదా. ౨౬

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ గణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును
అగు శ్రీ ర మ ణ గీ త ల యం దు
జ్ఞానసిద్ధి సామరస్య కథనము
అను నేకాదశాధ్యాయము

# ద్వాదశాధ్యాయము

## శ క్తి వి చా ర ము

క. పందొమ్మిదవది యగు దిన
మందు భరద్వాజజుఁడు మహామతి విద్వద్
బృందారకుఁడు కపాలి య
మంద ప్రశ్నమ్మడిగె రమణునిఁ గురునిఁ. ౧

## కపాలి వాక్యము

క. క్షితి విషయి విషయ వృత్తి
త్రితయంబిది గానఁ బడును దేటగ జ్ఞాని
ప్రతతికిఁ బామరజనసం
తతికిఁ, భగవానుఁడా, సదా తుల్యముగాఁ. ౨

క. జ్ఞాని మఱి యే విశేషము
చే నా పామరునికన్న క్షితి నధికుండో?
ఈ నా సందేహమ్మును
బో నడువఁగ నిపుడు నీకుఁబోలును, నాథా. 3

## భగవానునివాక్యము

క. ఏ పురుషునకుఁ విషయి స్వ
రూపాభిన్నమ్మగునో, పురుషపుంగవుఁడా,

వ్యాపార విషయములును స్వ
రూపాభిన్నముగ నా పురుషున కెసంగుఁ. ౪

క. ఏ పురుషునకుఁ విషయి స్వ
రూప విభిన్న మభిమానరూఢత నగునో,
వ్యాపారవిషయములును స్వ
రూప విభిన్నముగ నా పురుషున కెసంగుఁ. ౫

క. భేదాభాసమునఁ దెలియు
నాదటఁ దా జ్ఞాని తాత్త్వికాభేదమునే;
భేదాభాసవశంగతుఁ
డై దాఁ బామరుఁడు భేద మవనిఁ జెందుఁ. ౬

## కపాలి వాక్యము

క. ఎప్పట్టున భేదము లివి
ముప్పిరి గొని యెసఁగు, నాథ, భువిని స్వరూప
మ్మొప్పనె యది శక్తిగలిగి?
చెప్పుమ, యటుఁగాక శక్తిఁ జెందని దగునే? ౭

## భగవానుని వాక్యము

క. ఎప్పట్టున భేదము లివి
ముప్పిరిగొని యెసఁగు, వత్స, భువిని స్వరూప
మ్మొప్ప నది యెల్లశక్తుల
విప్పగ ననుచుఁ వచింత్రు వేదాంతవిదుల్. ౮

## కపాలి వాక్యము

క. ఏశక్తిని బొగడుదురో
యీశునిశక్తియని, నాథ, యిల వేదాంతుల్,
ఆశక్తినున్న చలనము?
లేశము చలనమ్ము కూడ లేదే? చెప్పుమా. ౯

## భగవానుని వాక్యము

క. అల శక్తియొక్క చలనము
వలననె లోకముల యుద్భవమ్మగుఁ, దంద్రీ;
చలనాశ్రయమగు వస్తువు
చలియింపక యుండు నెట్టి సమయమునందున్. ౧౦

క. అచలమ్మగు వస్తువుయొ
క్క చలన మెది లోకమునకుఁ గారణమగునో,
వచియింత్రు దానినె యని
ర్వచనీయము మాయ యని ధరన్ విద్వాంసుల్. ౧౧

క. ఇల నీ చలన మ్మెంతయు
నలరుచునుండు విషయికి యథార్థమువోలెన్;
చలనమ్ము స్వరూపమునకుఁ
గలుగ దరయ వాస్తవమ్ముగా, మనుజేంద్రా. ౧౨

క. లలి నీశ్వరునకు శక్తికిఁ
గలుగును భేదమ్ము దృష్టికారణమున; లో

పలికిన దృష్టి మరల్పుట
యలవడ, నీ మిథున మేకమగు నిక్కముగాన్. ౧౩

## కపాలి వాక్యము

క. కానందగు నీబ్రహ్మం
డానేక మొనర్చు నిజవ్యాపార మిదా
నో నిత్య? మనిత్యమొ? భగ
వానుఁడ, విశదమ్ముగాఁగ వచియింపఁదగున్. ౧౪

## భగవానుని వాక్యము

క. తన పరశక్తి కతమ్మునఁ
బనివడి చలనమ్ముఁ గొనియుఁ బరుఁ డచలుండే;
మునిజనులకె సంవేద్యం
బనఁదగు నుత్తమ రహస్యమై యిది యొప్పన్. ౧౫

క. వ్యాపారము చలనమ్మే;
వ్యాపారమె శక్తియనుచు వాక్రువ్వఁబడున్;
ప్రాపించి శక్తి, నొనరిచె
నా పరమపురుషుఁ డశేషమా దృశ్యమ్మున్. ౧౬

క. తనరుఁ బ్రవృత్తి నివృత్తియు
నని వ్యాపృతి; 'యత్ర సర్వ మాత్మైవాభూ'
త్తను శ్రుతి నివృత్తి పరమై
చెనుఁ గాదే యెల్ల రెండు సరణులలోనన్. ౧౭

క. అల 'సర్వ' మను పదమ్మున
నలవడు ద్వైత సముయస్థ మగు నానాత్వం;
బలవడు 'అభూ' త్తనఁగ భూ
వలయమ్మున నిందు నొక్క వ్యాపారమ్మున్. ౧౮

క. అట 'ఆత్మైవ' యనుచుఁ జె
ప్పటను విశేషముల కందుఁ బుట్టినవగు న
న్నిటి కాత్మయందె లయముం
డుట పేర్కొన్న శ్రుతియందు నుడువం బడియెన్. ౧౯

క. నరపుంగవ, శక్తివినా
స్వరూప మెంతయుఁ బ్రకాశవంతముగా; దీ
యిరుపేరులు శక్తికి వ్యవ
హరింత్రు వ్యాపార మనియు నాశ్రయ మనియున్. ౨౦

క. వ్యాపారమని మనీషులు
రూపింతురు విశ్వసర్గరూపాదికృతిన్;
ఆపయి నిఁక నాశ్రయము స్వ
రూపమునకు వేఱుగామి రూఢి, నరేంద్రా. ౨౧

క. సకలాత్మక మగుటను వే
ఱు కాంక్షపడ దెద్దియున్ స్వరూపం; బెవఁ డి
ట్లు కని తెలియు శక్తియె పా
యక వృత్తి స్వరూపము నని యత్నఁడే తెలియున్. ౨౨

క. వృత్తి యభావం బగుచో,
సత్తకు నానాత్వసిద్ధి సమకూడ; దిఁకన్

సత్తయె శక్తిని మించిన,
వృత్తికి నుత్పత్తి సంభవింపనిదె యగున్. ౧౩

క. ఇల సకలమ్మునకు మహా
ప్రళయము కాలక్రమమునఁ బ్రాప్తంబగుచో,
నల వ్యాపారము భేద
మ్ములేకయె స్వరూప లీనముంబలె నుండున్. ౧౪

క. ధారుణి శక్తివినా, వ్యవ
హారం బిది యంతగూడఁ బ్రాప్తింపదు, చే
కూరదు సృష్టియు, నీత్రిపు
టీరూపము జ్ఞానమును ఘటిల్లకపోవున్. ౧౫

క. ఏకపరాత్పరశక్తియె
వాకొనఁబడు రెండుపేర్ల; స్వయ మాశ్రయమై
గైకొను స్వరూప నామముఁ;
జేకొను వ్యాపారసంజ్ఞ సృష్టి నొనర్పన్. ౧౬

క. చలన మ్మెవ్వారికి శ
క్తిలక్షణ మ్మగునొ వారికిఁ దదాశ్రయమై
యలరారుచు, నరపుంగవ,
యలవడు నొక పరమవస్తువని చెప్పఁదగున్. ౧౭

క. అల యేక పరమవస్తువె
యిలఁ గొందఱు శక్తియందు, రికఁ గొందఱు వి
జ్ఞు లనుదురు స్వరూపమని, ప
రులు బ్రహ్మయని, యితరులు పురుషుఁ డని యనుదుర్.

క. ఇరు దెఱఁగుల లక్షణ వ
స్తురూపముల సత్య మొందుదురు, వత్స; వచిం
తురు లక్షణమున, మఱి వ
స్తురూపమున ననుభవింపుదురు సత్యమ్మున్. ౨౯

క. కనుక స్వరూపజ్ఞానం
బనయము ద్వివిధమ్ము సుమ్ము వ్యాపారము చే
తను వస్తువురూపముచే
నని యంద్రు తటస్థముగను సాక్షాత్తుగనున్. ౩౦

క. అనుదురు స్వరూప మాశ్రయ
మని, వృత్తియె లక్షణ మ్మటంచును, దండ్రీ;
కని వృత్తిచేత దానికి
ననన్య మూలమ్ము, నిలుతు రాశ్రయమందున్. ౩౧

క. ఎనయు స్వరూపము లక్షణ
మును, మఱి లక్షణము స్వరూపమును దానెనయన్
జేను; నిటు లీ యుభయమునకుఁ
దనరెడు సంబంధ మరయఁ దాదాత్మ్యమ్మే. ౩౨

క. ఇల వ్యాపారమను తట
స్థ లక్షణముచేత, మారిషా, లక్ష్యంబై
వెలయుటఁ జేసి స్వరూపం
బలయక వ్యాపారవంతమగు నిత్యమ్మున్. ౩౩

క. ఇఁక వ్యాపారము వస్తువు
నకన్న భిన్నమ్ముగాదు, నాయన; తత్త్వా

ర్థికి భేదజ్ఞాన మ్మిది
సకలము కాల్పనికమనుచు సరవిన్ దోఁచుఁ. 38

క. ఆ శక్తికిఁ గలయట్టి ప్ర
కాశం బీసృష్టి యాశ కల్పన; దీనిన్
సాశేషము దాటినచోఁ
దా శేషించెడిని యింకఁ దన రూపమ్మై. 39

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ గణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును అగు
శ్రీ రమణగీతలయందు
శక్తివిచారము
అను ద్వాదశాధ్యాయము.

# త్రయోదశాధ్యాయము

సన్న్యాసమునందు స్త్రీపురుషతుల్యాధికార నిరూపణము

సీ. ఆత్రేయ నామాన్వయమునకు వెన్నెల,
వాసిష్ఠమహనీయ వంశపు స్నుష,
ధీరుఁడు బ్రహ్మవేదియు నైన యా మహో
దేవుని గనినట్టి దివ్యజనని,
ఇలఁ బురంధ్రీ జనమ్ములకెల్ల మేల్బంతి,
లోకసంసేవావ్రతైకనిరత,
*బ్రహ్మాది విబుధ సుప్రస్తుతమా మహా
విద్యను దాల్చు నవీనవాణి,
వింధ్య కీవలఁ దారిణీవిద్య కాది
గురువగు యశస్విని, తపోనుకూల, నాద
యిత విశాలాక్షి తా విశ్వహితుని రమణ
మాని నడిగెఁ బ్రశ్నలు రెండు మన్ముఖమున. (౧—౪)

క. అతివల కాత్మస్థితులకుఁ
బ్రతిబంధము కలుగునేని, భవనత్యాగ
వ్రతమూని హంసినులుగా
సతతము వర్తిలుట శాస్త్రసమ్మత మగునే? ౫

---

* కాది (కకారాది) పంచదశీ మహావిద్య.

క. జీవన్ముక్తిని గాంచిన
యా వనితకు దేహపాతమై పోయెడుచో,
నావల దహన మొనర్పం
గావలయునో, మఱి సమాధిగావలయునొకో?. ౬

క. తా నీ యిరుప్రశ్నల భగ
వానుఁ డఖిలశాస్త్రభావవాస్తవవిదుఁడౌ
జ్ఞాని ఋషిసత్తముఁడు విని,
దానఁ నిర్ణయము నిట్లు దయతో నుడివెన్. ౭

క. సరవి స్వరూపస్థితలై
పరిపక్వతఁ గన్నవారు భామినులయ్యున్,
ధర వారలకు నిషేధం
బరుగుడు, దోసమ్ము లేదు హంసీత్వమునన్. ౮

క. జ్ఞానమ్మును ముక్తియును స
మాన మగుటచేతఁ, గాల్ప మానుట తగు స్త్రీ
నైనను జీవన్ముక్తను;
మే నది దేవాలయము సుమీ నిక్కముగాఁ. ౯

క. అరయఁగ నేదోషమ్ములు
పురుషుని ముక్తుని శరీరమును దహియింపన్
బొరయునో, ముక్త యయిన స్త్రీ
శరీరము దహింపఁగ నవి సర్వముఁ బొరయున్. ౧౦

క. ఇరువదియొకటవ దినమం
దు రమణుఁడు మహర్షి కోవిదుం డీ యర్థం

బిరవుకొన జ్ఞానవతితో
వరకరుణ యెలర్పఁ దాను వక్కాణించెన్. ౧౧

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ గణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును అగు
శ్రీ రమణగీతలయందు
సన్న్యాసమునందు స్త్రీపురుషతుల్యాధికార నిరూపణము
అను త్రయోదశాధ్యాయము.

# చతుర్దశాధ్యాయము

## జీవన్ముక్తి విచారము

శా. భారద్వాజుఁడుఁ బండితప్రవరుఁడున్
బ్రాజ్ఞుండు వైదర్భుఁడున్
స్ఫారప్రాకట వక్తయున్ శివకులో
పాధి ప్రభావుండు ము
వ్వారంపున్ దుదిరేయి దానడిగె జీ
వన్ముక్తినిం గూర్చి దు
ర్వారాజ్ఞున్ ఋషి; నంత నందఱు వినన్
వాక్రుచ్చె మౌనీంద్రుఁడున్. (౧—౨)

క. చలియింపక శాస్త్రీయం
పు లౌకికపుఁ బ్రత్యయచయములచేత, స్వరూ
ప లయం బగు దృఢ నిష్ఠయె
యిల జీవన్ముక్తి యనుచు నెన్నంబడెడిన్. ౩

క. ఒక విధముగనే యగు మా
ఱక సామాన్యముగ ముక్తి ప్రజ్ఞానికి; భౌ
తిక దేహస్థు విగతబం
ధకు జీవన్ముక్తుఁ డనుచు ధర నంద్రు బుధుల్. ౪

క. నిగమములు బ్రహ్మలోకము
ను గన్న ముక్తునిగ నెవని నుడువునో యా బ్ర
హ్మగునకు జీవన్ముక్తున
కగు నత్యంత మ్మభేద మనుభవమందున్. ౫

క. లీనమ్ము లే మహాత్ముని
ప్రాణము లిచ్చటనె యగునో, పండితవర, య
వ్వాని యనుభూతిసైత
మ్మా నీ పై యుభయుల కగు ననుభవమువలెన్. ౬

క. తనరూపమందు నిలుకడ
యును, బంధము నష్టమగుటయును సమమే గా
వున, ముక్తి యేకవిధమై
తనరును; మఱి భేద మిట నితరమతియె గనున్. ౭

క. జీవించియె ముక్తుండగు
నే వాఁడు మహాత్ముఁ డాత్మనే సంస్థితుఁడై,
యా వానికి మాత్రము ప్రా
ణావలి, నరపుంగవా, లయం బగు నిటనే. ౮

క. కాలక్రమమునను దపః
పాలన పరిపాకమునను స్వర్గాభావం
బాలాగును బ్రాపించెడి
నోలిన్ జీవద్విముక్తు, నొడ లుండినను. ౯

క. ఆపైఁ బరిపాకముచే
రూపాభావమ్ముగూడ రూఢిగ సిద్ధిం

ప్రాపించుఁ; గేవలము చి
ద్రూపుండై సిద్ధుఁ డతఁడు ప్రోది న్మెలఁగున్. ౧౦

క. ఈరెండగు నవి సిద్ధులు
శారీరసమాశ్రయములు సంప్రాప్తించున్,
బూరుషవర, యచిరమ్మౌ
తారక మగునట్టి దేవతాకృపవలనన్. ౧౧

క. ఈభేదముబడి యనుభవ
వైభవమున హెచ్చుతక్కువలు కలుగవు; దే
హాభావతనో దేహిఁగ
నో భాసిలు నాత్మసంస్థుఁ డోగి ముక్తుండే. ౧౨

క. అరయఁగ నాడీ ద్వారా
ర్చిరాది మార్గమున నూర్ధ్వవృత్తిఁ బడయు న
న్నరుఁ డటఁ బోడము తెలివిచే
సరగున సాధింపఁ గలుగు సద్యోముక్తిన్. ౧౩

క. సుపరిణత మ్మగు చిత్తము
నుపాసనయు నొప్పునట్టి యోగికి భగవత్
కృపవలనన్ గూడును నా
డిపథమ్మున నుత్తమగతి తేవ దలిర్పన్. ౧౪

క. వీని కఖిల భువనమ్ముల
లో నిచ్ఛమెయి విహరణములును, గోరిన పల్
మేనులఁ దాల్చుటయును, లో
కానుగ్రహశక్తియును, దమంతన యొదవున్. ౧౫

క. కొందఱు కైలాసం బని,
కొందఱు వైకుంఠమనియుఁ, గోవిదు లింకన్
గొందఱు రవిమండల మని
యందురు ముక్తులు వసించు నా లోకమ్మున్. ౧౬

క. ఈ యెల్ల ముక్తలోకము
లీ యిల మున్నగు జగమ్ము లెట్టులొ, విబుధేం
ద్రా, యట్లు స్వరూపమునం
దే యద్భుతవిభవ శక్తియే కల్పించెన్. ౧౭

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ గణపతి
గ్రథితమును వేంకటసుబ్బరామానువదితమును అగు
శ్రీ రమణగీతలయందు
జీవన్ముక్తివిచారము
అను చతుర్దశాధ్యాయము.

# పంచదశాధ్యాయము

## శ్రవణ మనన నిదిధ్యాసన నిరూపణము

క. ఓ నాథా, శ్రవణ మనం
గానేమి? మఱి మనన మనఁగా నెద్దియగున్?
మానికులశ్రేష్ఠుఁడ, యెది
యౌను నిదిధ్యాసన మనునది వివరింపన్?. ౧

క. అని యిట్లు నేను భగవా
ను నడుగఁగా, బ్రహ్మవిద్ఘనుం డతఁ డుదయం
బున నిరువదిరెండవ దిన
మునందు నిజశిష్యసంఘమున నిట్లనియెన్. ౨

క. వేదశిరస్థిస్థిత వాక్యము
లాదట నర్థమ్ము తెల్లమగునటు లాచా
ర్యోదితముగాఁగఁ జెవి నా
స్వాదించుటఁ గొంద ఱంద్రు శ్రవణం బనుచున్. 3.

క. విదితాత్ముఁడైన యాచా
ర్యదేవువలనన్ స్వభాషయందలి నుడు లా
త్మ దెలుపునట్టివి వినుటను
జదురుగ మఱికొంద ఱంద్రు శ్రవణం బనుచున్ ౪

మ. వినిగానీ గురువర్యునొద్ద సరవిఁ
వేదాంతవాక్యాలో యా
తని వాక్యమ్ములో, పూర్వజన్మ సుకృత
త్వప్రాప్తమో తెల్వో వ
ల్లనుగానీ, 'యహ' మన్న ప్రత్యయపు మూ
లం బీవు దేహాది గా
వను నంతశ్శ్రవణంబె యెందు శ్రవణం
బౌఁజుమ్ము నిక్కమ్ముగాఁ. గీ, ౬

క. అనెదరు కొందఱు మననం
బన శాస్త్రార్థపు విచారమనుచును; నట్లై
నను వాస్తవమ్మరయఁగ మ
ననము స్వరూపపు విచారణమ్మో, తండ్రీ. ౭

క. ఏ సందేహమ్ము విప
ర్యాసమ్మును లేనియట్టి బ్రహ్మాత్మ జ్ఞా
నాసాదన మరయ నిది
ధ్యాసన మని యంద్రు, *మానదా, కొంద ఱిలఁ. ౮

క. ఏ సందేహమ్ము విప
ర్యాసమ్మును లేనిదయ్యు నల కేవల శా
స్త్రాసాదిత మైక్యజ్ఞత
వాసిగ సమకూడ దనుభవమ్మున కెందుఁ. ౯

క. ఈ సందేహమ్ము విప
ర్యాస మ్ముభయ మ్మడంగు ననుభవమున నే,

* వెలుపలనులోపలను బ్రహ్మము నే 'మాపయతి'=గ్రహింపఁ జేయు నది, 'మానము'-ప్రత్యగ్దర్శనము-కావున, 'ప్రత్యగ్దర్శనము నిచ్చువాఁడా.'

వాసిష్ఠ, తొలఁగవయ్యావి
శాసనమహిమాఢ్యశాస్త్రశతములకేనిన్. ౧౦

క. కలుగవు శ్రద్ధావంతున
కల శాస్త్రీయములు సంశయ విపర్యయముల్;
గొలఁదిగ శ్రద్ధ యడంగినఁ
దలయెత్తి చెలంగు మఱలఁ దదుభయము లిలన్. ౧౧

క. ఎనయు స్వరూపానుభవ
మ్మున, వాసిష్ఠ, యలరెండు మూలచ్ఛేద
మ్మును; గావున నిదిధ్యా
సన మనఁగాఁ దగు స్వరూపసంస్థితియె ధరన్. ౧౨

క. కలుగక స్వరూప సంస్థితి,
వెలుపల నెవ్వండు, తంద్రి, విహరించునొ, దా
నలవడ దపరోక్షం బగు
తెలివి యతనికి శతశాస్త్రతీవ్రవిమర్శన్. ౧౩

క. కదురఁగ స్వరూప సంస్థితి
కొదువవడక సహజమగుచుఁ, గుండినవర, య
ల్లదె ముక్తి, యదియె నిలుకడ,
యదె సాక్షాత్కారమనుచు ననఁదగు నవనిన్. ౧౪

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ
గణపతి గ్రథితమును వేంకటసుబ్బరామాను
వదితమును అగు శ్రీ రమణ గీతల యందు
శ్రవణ మనన నిదిధ్యాసన నిరూపణము
అను పంచదశాధ్యాయము.

# షోడశాధ్యాయము

## భక్తి విచారము

క. తరువాత భక్తిఁ గూరిచి
సరవిం బ్రశ్నితుఁడు పురుషసత్తముఁడు మహా
త్తరభాగుఁడు భగవానుఁడు
కరుణాంబుధి రమణమౌని కమ్మగఁ బలికెన్. ౧

క. అందఱకుం బ్రియ మాత్మయె;
యెందుం బ్రియ మాత్మకన్న నెది? భక్తి యటం
చెందురు తెగని చమురు ధా
రం దలఁపింపఁగల ప్రీతిఁ బ్రవచనశీలుర్. ౨

క. కవి యెఱుఁగుఁ బ్రీతిచేత భ
గవంతుఁడు తనదగు నాత్మకన్న నభిన్నుం
డవుటను; భిన్నుఁగఁ బరుఁడె
న్నవాఁడయియు, లీనుఁ డౌచు నూల్కొను నాత్మన్. 3

క. ప్రవహించుఁ దైలధారకు
సవతుగ నే ప్రీతి సతము సర్వేశ్వరునం,
దవితథముగ నయ్యది చే
ర్చు వలవనతని మతినిన్ స్వరూపమ్మున నే. ౪

శా. చింతించుచుఁ దను భక్తుఁ డెప్పుడు పరి
చ్ఛిన్నుండు స్వల్పజ్ఞుఁ డం
చేంతన్ గ్లేశ నివృత్తికై * విషయరూ
పాప్తిన్ జగద్వ్యాపి యై
వింతై యుత్తమమైన వస్తువును సే
వించున్ మదిన్ దేవతా
చింతన్, దేవతయంచుఁ గొల్చు నతఁడై
చెందున్ దుదిన్ దానినే. ౧౬

క. పురుషవర, దేవతకు నా
మరూపకల్పన మొనర్చు మార్గమ్మున, నా
పరనామరూపములచేఁ
బొరిఁ బొరి నిల నామరూపముల గెలువ నగున్. ౭

క. పరిపూర్ణంబగు భక్తికి
సరవి నొదవు శ్రవణ మొక్కసారియె చాలున్;
బరిపూర్ణ జ్ఞానమునకుఁ
బరికరమై యప్పు డల్ల భక్తి యెసంగున్. ౮

క. ఎదిభక్తి ధార లేనిదొ
యది విచ్ఛిన్నం బటంచు ననఁబడు నవనిన్;
తదతీతభక్తి కారణ
మది కాఁగల దనుచు నిర్ణయము సేయనగున్. ౯

---

* 'పయి' యని పాఠాంతరము.

క. కోరికకై భక్తి సలిపి
కోరిక తీఱియును తనివిగూరని వాఁడై,
పూరుషుఁడు నిత్యసుఖమును
జేరఁగ నీశ్వరుని మరల సేవించుఁ దుదిన్. ౧౦

క. కామసమేతంబయ్యును,
కామాప్తిని భక్తి వెనుకగాఁ దిరుగ దిలన్;
స్వామియగు పరమపురుషుని
పై ముదిరిన శ్రద్ధ మఱియుఁ బడయును వృద్ధిన్. ౧౧

క. నానాట నెదిగి యదనునఁ
దా నిండంగలదు భక్తి; తత్క్రియఁ బరమం
బౌ నిండు భక్తిచేతను
జ్ఞానముచేఁ బోలె భవముఁ గడవఁగ వచ్చున్. ౧౨

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ
గణపతి గ్రథితమును వేంకటసుబ్బరామాను
వదితమును అగు శ్రీ రమణగీతల యందు
భక్తి విచారము
అను షోడశాధ్యాయము.

# సప్తదశాధ్యాయము

## జ్ఞానప్రాప్తి విచారము

క. ఇరువదియైదవదగు వా
సరమున వైదర్భుఁడు బుధసత్తముఁడు సమా
దర వినయావనతుం డయి
మరలం బ్రశ్నించెఁ దాను మౌనిశ్రేష్ఠున్. ౧

### వైదర్భుని వాక్యము

క. క్రమముగ నానాటను గొం
చెము గొంచెముగాన వచ్చి చెందునొకో జ్ఞా
నము? గాక, వెలుఁగునొ యొకే
సమయమ్మున భానులీల సంపూర్ణంబై ? ౨

### భగవానుని వాక్యము

క. క్రమముగ నానాటను గొం
చము గొంచెముగాఁగ వచ్చి చెందదుసూ జ్ఞా
నము; స్వాభ్యాసపుఁ బరిపా
కముచే నొకమాటె పూర్ణగతి భాసిల్లున్. ౩

### వైదర్భుని వాక్యము

క. భగవానుఁడ, యభ్యాస
మ్మగుతఱి లోపలికి వెలికి యాతాయాత

మ్మొ గనుఁ వృత్తి; వచింపఁ
దగునే యీలాగు వృత్తి జ్ఞానం బనుచుఁ ? ౪

భగవానుని వాక్యము

క. లో నరుగు బుద్ధి వెలుపల
రానగుచో మరల, బుధవరా, యభ్యాస
మ్మే నాఁబడుఁ; జ్యోతినెన్నఁడుఁ
గానని యనుభవము నం(ద్రు జ్ఞానమ్మనుచుఁ ? ౫

వైదర్భుని వాక్యము

క. ఓ మునివర, జ్ఞానమునకు
భూమిక లొక కొన్ని శాస్త్రములలో విద్వత్
స్వాములచే నుడువంబడె;
నేమాడ్కి సమన్వయించు టేర్పడు నందుఁ ? ౬

భగవానుని వాక్యము

క. ఆ ముక్తిభేదములవలె
భూమిక లఖిలములు శాస్త్రములఁ బ్రోక్తమ్మొల్
తా ముందును పరబుద్ధినె;
ఏమెయి జ్ఞానులకు జ్ఞాన మేకమె, ప్రాజ్ఞా. ౭

క. ప్రారబ్ధ మనుసరించిన
శారీరేంద్రియములాది సాధనల క్రియఁ
దా రితరులు గని, భూమిక
లేరుదు, రీ తారతమ్యమే లే దరయఁ. ౮

## వైదర్భుని వాక్యము

క. సకలాజ్ఞాన నిబర్హణ
మొకపరి సిద్ధించియుండియును, బ్రజ్ఞానం
బికఁ మరల సంగదోషా
త్మకమగు నజ్ఞానమునను మఱుఁగయి చేనునే? ౯

## భగవానుని వాక్యము

క. సకలాజ్ఞాన మడంచియు
నొకపరి సిద్ధించెనేనియును బ్రజ్ఞానం,
బికఁ మరలఁ దిరస్కారణ
ప్రకారముం బొరయకుండు, భారద్వాజా. ౧౦

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ
గణపతి గ్రథితమును వేంకటసుబ్బరామాను
వదితమును అగు శ్రీరమణగీతలయందు
జ్ఞానప్రాప్తి విచారము
అను సప్తదశాధ్యాయము.

# అష్టాదశాధ్యాయము

## సిద్ధమహిమానుకీర్తనము

ద్వి. వరపరాశరగోత్రవారాశిసోము,
ధరణీసురకుల విస్తరయశస్కరుని,
విమల 'సుందర' నామ విబుధనందనుని,
కమలపత్ర విశాల క్రమలోచనుని, ౧

అరుణశైలేంద్రగతాశ్రమవాసు,
పరమహంసు, నిరంజను, రహితచ్యుతుని,
కరుణాప్తలోకసంగ్రహకర్మ నిరతు,
నిరతాక్షరాత్మ సుస్థిరతరస్థితుని, ౨

సకల సంశయ నివారక దివ్యభాషు,
అకదభ్రమద్విరదాంకుశ వీక్షు,
సతత పరసుఖార్థసారప్రయత్ను,
స్వతనువిషయ కాలసాలస శీలు, ౩

పరిణత సహకారఫల కాంతిదేహుఁ,
జరతరేంద్రియవర్గ సంయమ దక్షు,
సమ్మృత చిద్ఘనవల్లి హారికళత్రు,
సుమితోక్తి విరచితాగమసంగ్రహాఢ్యు, ౪

అకలంకదీప్తతరాత్మతేజముల
స్వాకరమ్ములను పంకజాతబంధుఁ బలెఁ
బదసమాశ్రయ జడభావ మదనున
వదలించు వాని, నవ్యయగుణనిధిని,

మృదుతమవచనుని, సదయార్ద్రవీక్షు,
సదమల వికసిత సరసీరుహాస్యు,
పగటి చేందురుఁబోలె భావసంశూన్యు,
గగనసూర్యుఁ బలె నఖండ హృద్భాసు,

తనమేని కదయు, వ్రతమునందుఁ గఠిను,
ధన విషయాదులం దనపేక్షచిత్తు,
ముని, నరోషు, నపేత ఘన మనోరథుని,
ఘనచిత్రవాహమ్మునను జొక్కువాని,

విగతమోహు, నలోభు, వీతభావనుని ,
అగతమత్సరుని, నిత్యసుమహోత్సవుని,
భవమహోదధితారణ వరకర్మమున
నవిరతాప్రతిఫలోద్యతుఁ డైనవాని,

ఉ. 'నాయది యమ్మ' యంచు గణ
నాథుఁడు పార్వతియంక మెక్క, 'నా
నాయన పొ'మ్మటంచుఁ గడు
నైపుణిఁ దాను హరాంక మెక్క, త
న్నోయన నీశ్వరుండు ప్రియ
మూని శిరమ్మున ముద్దులాడఁగా

నే యతఁడొప్పఁ గ్రౌంచబిల
కృత్తగు నాతనికిన్ విభూతునిన్

చ. తొలినుడి వేదమంతటికిఁ
దొల్త[1], బిడౌజుని ప్రక్క[2], కూర్మమున్[3],
మల కను కామరేశ్వరుఁడు
నాఁ జెను మూఁడునుగూడు మొత్తమున్[4],
సలలిత సూక్ష్మధార్యమృత
సంకలితామృతమున్[5], బ్రణామమున్[6],
గలయ లభించు శబ్ద పద
కమ్ము[7] నకైన రహస్యమర్థమున్,

తే. దండమే లేని యతి, యార ! దండపాణి,
తారకుఁడు దుఃఖజలధికిఁ, దారకారి,
భవము వీడియు, సతతమ్ము భవభజనుఁడు,
హంసయై మానసవిరక్తుఁడైనవాని,

తే. ధైర్యసంపద స్వర్ణభూధరసమాను,
అతి గభీరతలో సరిత్పతికి నధికు,
మించు శాంతి ధరిత్రి జయించు వాని,
దాంతి కుపము, నశాంతికథాదవిష్ణు,

తే. చెల్లదనమందుఁ జెందురు సాటివానిఁ,
దేజమెన్నఁగ సూర్యుని దీటువాని,
బ్రాహ్మ్యసంస్థితి వటమూలవాసుఁ బితరుఁ
బోలు నచలుని, నా వెన్కఁ బుట్టువాని, ౧3

---

1 ఓం. 2 వ. 3 చ. 4 ద్యు. 5 వే. 6 నమః. 7 స్కందమహామంత్రము.

తే. దేవసేనాఖ్య రమణీయభావరమణి
శుభసువృత్తిరూపను శిరస్సున నిపుడును
బూనియు, మనోజగంధమ్ము లేనివాని,
అట్లు గృహియయ్యు యతినాథుఁడైన వాని, ౧౪

క. వందారులోకవరదు, న
మంద గురువును నరదంతి మంత్రేశునకుఁ,
మందారమనఁ బదము చే
టందిన యందఱకుఁ దాపమార్చెడు వానిఁ, ౧౫

తే. బహుతరవిచిత్రయుక్తి శోభావహమ్ము
వైదికాధారమగు తంత్రవార్తిక మ్మొ
నర్చినట్టి భట్టునకు బుధార్చితునకు
నపర వేషు, వేదాంతవాక్యపరిశీలు, ౧౬

ద్వి. ప్రాప్తవేదాంతసారసుసంగ్రహమ్ము
గుప్త మల్ప మనంతకోటిముఖమ్ము
అరుణాద్రిపంచరత్నాఖ్య మ్మొవండు
స్థిరసూత్రభూతమ్ము సేసె నాగురుని, ౧౭

గీర్వాణ మేమియు నేర్వకుండియును
ఉర్వీఁగావ్యపుగంధ మూనకుండియును
గ్రంథకార్యమున వాక్యము వెన్కఁ బఱచు
బంధురభావసంభారమౌ వాని, ౧౮

ఇలతల్లిపాల్ ద్రాగి కులుకు పల్కొంది
అల శంకర స్తవమ్ములఁ జేసినట్టి

వరకవి ద్రావిడబ్రాహ్మణశిశువు
పరవేషధారి, నపారమేధసుని, ౧౯

ధర బ్రహ్మనిష్ఠిత దశఁబ్రదర్శించి
తరణి నా యుక్తివాద తిమిర మడఁపఁ
గ్రౌంచభూధరరంధ్రకారుండై గొన్న
యంచితైహికతృతీయావతారమును, ౨౦

భువిఁ గుంభజాదిసన్మునిపూజఁ గొన్న
ద్రవిడభాషను విశ్రుత కవిపుంగవుని,
గురువు లేకయె బుద్ధిగరిమతోనే య
జరము పరమ్ము తేజముఁ గన్నవాని, ౨౧

కూనయందును జడగోపకునందు
వానరశునులందు హీనునియందు
అక్షుద్రబుధునందు నాశ్రితునందుఁ
బక్షపాతరహితు, నీక్షణసామ్యు, ౨౨

శక్తిమంతుండైన శాంతిసంయుతుని,
భక్తిమంతుండైన భావనాభేదు,
నే కూర్మి లేకున్న లోకవత్సలుని,
నాకాంశుఁడై యున్న నక్రమచేష్టితుని, ౨౩
"చేనిమెద నాయన సన్నిధి కేను
గనుక నన్ను వెదకఁగా వలదనుచు"
విరచించి గృహమును వీడి యేతెంచి
యరుణాచలపదమ్ము నందినవాని, ౨౪

క. ఈదృశ గుణగణశోభా
హ్లాదితభువనుని రమణమహర్షిని భగవత్
పాదుని సిద్ధగణమహిమ
మాదరమున నమృతనాథయతివరుఁ డడిగెన్. ౨౫

క. భగవానుఁడు నగవాసుం
"డగణ్య మా సిద్ధగణమహాత్త్వము, శివసా
మ్యగులు, శివరూపు, లియ్యం
దగుదురు వరములనుగూడఁ దా" రని పలికెన్. ౨౬

ఇట్లు బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును వాసిష్ఠ
గణపతి గ్రథితమును వేంకటసుబ్బరామాను
వదితమును అగు శ్రీరమణ గీతలయందు
సిద్ధమహిమానుకీర్తనము
అనిన యష్టాదశాధ్యాయము.
శ్రీ రమణార్పణమస్తు.

# శ్రీ రమణ విభక్త్యష్టకము

శ్రీమత్పారాశరుం డుచ్ఛ్రితగుణనిధి గౌ
రీయుఁడున్ బావనుండున్
స్వామిప్రాయుండు సంధ్వస్తభవభయుఁడుఁ దా
సచ్చిదానందకందం
బౌ మానారూఢుఁడున్ నిత్యసుముఖుఁడు సుతృ
ప్తాత్ముఁడున్ గేవలాత్మా
రాముండున్ దివ్యదృక్కా రమణతపసి యా
రా! యిదే కానిపించున్. 1

వేనిన్ గాంచంగనే యుర్విఁబనివలయుటల్
వీఁగు సర్వమ్ము, సద్యో
ధీనైర్మల్యమ్ముచే * నేఁది చనును మది సం
ధిల్లు సంకల్ప మెల్లన్,
నానాత్వంబౌ తలం పెన్న విధి కనుజమే
దాయయేన్ సంశమిల్లున్,
నేనా పారాశరున్ మాని గురురమణు ధ్యా
నింతు సాధున్ సతమ్మున్. 2

---

*ఏఁదు= తొలఁగు, నివర్తిల్లు.

వీక్షింపంగాఁబడెన్ దా వెలుపలి కలగా
విశ్వచిత్రం బి దాత్మన్,
వీక్షల్ ప్రత్యగ్గతల్ సద్వినతభయహరల్
ప్రేమసార్ద్రల్గ నయ్యెన్,
ప్రక్షిప్తంబుల్ విరక్తిన్ స్వయ మనుగత భా
వంబు, లెవ్వానిచేతన్,
రక్షంగాంచంగనే యా రమణతపసిచేఁ
బ్రాణి ధన్యత్వ మొందున్. 3

తానే స్వాధ్యాయుఁడౌ నుత్తమపదవిదుకై
తత్త్వభావజ్ఞుకై స్వా
త్మానందాపాదికై జన్మమరణభయ సం
హారికై వేనికై డెం
దానన్ దామాత్మ నీ నంత శరణయుతులై
ధన్యతన్ గాంత్రు లోక
ప్రాణుల్ జ్ఞానాప్తి, నాయోంరమణునకయి పా
రాశరార్థమ్ము మ్రొక్కుల్. 4

కామాబ్ధిప్రాంతగుండున్ గతకలిమలుఁడున్
గ్రమవాగాత్మదేహుం
డాముక్తాఖండదీప్తుం డయి తపమునఁ బ్ర
జ్ఞాఢ్యుఁడౌ వేనికంటెన్
భూమిన్ లేదే శరణ్యంబు విషయవిషభృ
ద్భుక్తమర్త్యాళికిన్, నా

కా మా పారాశరాచార్యరమణువలనఁ
స్వాత్మవిజ్ఞాన మాతఁ. 5

నే నంచుఁ నాదటం చెన్నిక యిట విడెఁ దా
నే, వివేకంబె నిల్చెఁ,
దా నౌరా! ధర్మమౌఁగాద యను విధినిషే
ధ ప్రపంచం బడంగెఁ,
దా నిష్టానిష్టసామ్యస్థతయు భువిహితా
ర్థమ్మగుఁ, వేనికెన్నఁ
బ్రాణిప్రాప్తావనం బాప్రభురమణుని యీ
పాదయుగ్మంబు గొల్తుఁ. 6

ఔరా! నిత్యమ్ము తృప్తుం డభయగతుఁడు వ
ర్ణాశ్రమాతీతుఁడుఁ బ్ర
హ్మారూఢుం డుచ్ఛ్రాసిక్యనిధి యొతనియం
దష్టసిద్ధుల్ ప్రణమ్రల్,
పారంబుంగాంచు కోర్కెల్ వరసుఖముఁ జొరం
బాఱుఁ బోలెఁ సతమ్మున్,
శ్రీరాట్పారాశరుం డా ఋషిరమణునఁ గే
రించె నా ధీంద్రియంబుల్. 6

స్వామీ, సర్వార్తిహారీ, పరమగురువరా,
స్వచ్ఛవిజ్ఞానమూర్తీ,
సామాన్యాలభ్యమౌ నీ చరణయుగిఁ గనం
జాలి వాసిష్ఠు చల్వఁ,

గామంబుల్ పూర్ణముల్ కాఁగఁ, బ్రణిహితమతిఁ
గంటిధన్యత్వముఁ, బ్రో
ద్దామా, రక్షింపు *బాముల్ తలఁగి, రమణా, యీ
దైవరాతుఁ బ్రపన్నుఁ. 8

తే. శ్రీరమణు| దివ్యరమణీయచిద్వికాసు
సర్వశరణు సంస్మరణీయసద్విలాసుఁ
దలఁచెదఁ బరముఁ బరమాత్మ తత్త్వబోధు
నాధు నఖిలకల్మషకీలనప్రబోధు॥ 9

ఇట్లు దైవరాత విరచితము
వేంకట సుబ్బరామానువదితము
శ్రీ రమణవిభక్త్యష్టకము
సంపూర్ణము.

---

*బాము=జన్మము, దుఃఖము, పాపము.

# శ్రీరమణ చత్వారింశత్

తోటకము॥ కరుణాబ్ధి, స్వగాథ నఘం బడఁచున్,
అరుణాచలుఁ దత్పరుఁడై కొలుచున్,
హరి భాషిత తత్త్వము నాదుకొనున్
హర మౌనరహస్యము హత్తుకొనున్. ౧

,, గణధాణ్య కారిజగద్గురువున్,
గుణరత్నమహోదధికోటియు, నా
ఘనగూఢవిభాకరుఁడై వడియా
తనుకంచుకగుప్తసుధామకుఁడున్. ౨

,, చరదింద్రియనిగ్రహచాతురియుం
బరకీయగుణాదరపాటవముం
బరమామలమౌనసమాధియు భీ
కరకామజయంబును గన్నతఁడున్. ౩

,, తనయాఁకలి వేళనె తన్పికొనున్,
స్వనఘవ్రత మద్రిని జల్పికొనున్,
ననవిల్తుని కోత్తల నాచికొనుం,
బని యాత్మవిబోధగ మన్కిఁ గనున్. ౪

,, భవభీకరనీరధిపారగుఁడున్,
బ్రవిఫుల్లకరాంబుజపాత్రికుఁడున్,

స్వవిలోకనశీతలభాస్వరుఁడున్,
అవనమ్ర సుహృద్భయహారకుఁడున్. ౫

తోటకము. వినతామితభక్తుల పెన్నిధియున్,
జనితాపవిధూననసన్నిధియున్,
మునిధర్మతతిప్రతిభుప్రభుఁడున్,
ఘనతామసవృత్తి విఘాతకుఁడున్. ౬

,, ఉరగాధిపవర్ణ్యగుణోదధియున్,
బరసత్యహితప్రియభాషణుఁడున్,
ఉరుగౌరవ మబ్బిన నుబ్బఁడు, ను
ర్వర నిందఘటిల్లిన వందురఁడున్. ౭

,, యతినాయకుఁడున్, సుకుశాగ్రలసన్
మతియున్, ధృతినాశితమానసుఁడున్,
తతసమ్మదపూర సదావహుఁడున్,
క్షతసర్వదురాంతరశాత్రవుఁడున్. ౮

,, అల శ్రీభగవత్పద మన్య జనా
సులభంబు స్వశక్తిని జూఱగొనెన్,
ఇలనిర్మముఁ, డార్యజనేడ్యహితుం,
డలరున్ గణరాట్ హృదయస్థితుఁడై. ౯

,, హిమశైలసుతాంకమునే విడి లో
కములోఁ దమమున్ దలఁగన్ నరవే
షముఁ దాల్చె నెవం డలస్కందుఁడె, యా
రమణర్షి కృపన్ భువి రక్షఁ గనున్. ౧౦

మంజుభాషిణి॥ పర దేశిలీల సితవస్త్రఖండ సం
పరివేష్టనాఢ్య కటిభాగశోభియా
వర దేశికుండు శిఖివాహనుండె యీ
నర వేషధారి భువనమ్ము నేలుతన్. ౧౧

ద్విపద॥ యావద్గుణప్రపంచాతీతునకును
పావననైష్ఠికబ్రహ్మచారికిని
నా వందనము కుహనామనుష్యునకు
దైవికగురునకుఁ దారకారికిని. ౧౨

శా. యానార్థ మ్మిట లేఁడు కేకిపతి; లే
దా గంగ స్నానార్థమున్;
పానార్థ మ్మవనీధరేంద్రసుతచేన్
పాలన్ సుధల్ లేవు; త్వ
ద్గానార్థమ్ము వయస్యులా ప్రమథనే
తల్ వైణికుల్ లేరిటన్;
దేనం జేసి వసింతు, దేవ, యరుణా
ద్రిన్, క్రౌంచభూభృద్భిదా? ౧౩

శా. ఏకాస్యమ్మె, యుమాంకవాసవిరహా
మ్మే, వీతశక్త్యాయుధ
మ్మే కేల్, మర్త్యుఁడె, నాకసేనయును లే
దే ప్రక్కఁ డెక్కెమ్ములో;
లోకమ్మున్ గనుమాయ వేసమిది చా
లుంగాని, కన్ బ్రామఁగా

నీకుం జొప్పడు నెట్లు, తారకరిపూ,
నీ స్తన్యదాయాదునిన్? ౧౪

శా. యోగీశుండని కొందఱుం, బరులు ది
వ్యోదంచితజ్ఞానియం,
చౌఁగా సాధువటంచుఁ గొందఱు, గురుం
డంచుం బెఱల్, త్వత్పద
ప్రాగబ్జంబులఁ గొల్తురు; మానవహితా
ర్థప్రోద్భవస్కందుఁ గా
నాగారీయుఁగ నిన్నుఁ గాంత్రు, రమణా
ఖ్యా, యిర్వురో ముప్పురో. ౧౫

శా. ఓంకారార్థముఁ జెక్కఁ గాఁ గఱపి తో
హో! వాక్పతీనేతకుం;
జెంకుం బూనక నేర్పె నీవదన మ
చ్ఛా! తండ్రికిం గూడనుం;
ఇంకం ధీగురుతాప్తి నన్న కర రే!
యీ వొజ్జవై తిప్పు; డే
వంకం బెద్దవెయైతి పిన్నవును, సు
బ్రహ్మణ్యా, నీగుణ్యతన్. ౧౬

శా. ఆరోహించెను దేని మున్ను శ్రుతిపా
రాలోకి పారాశరుం
డారూఢిం, దరువాత బోధనకళా
వ్యాధూతతామిస్రశం

కారాతిప్రథఁ గన్న శంకరుఁడు లో
కాచార్యసింహాసనం
బారో! యయ్యది యిప్డుగోరె నిను, మ
ర్త్యాకార, దేవావనా. ౧౭

శా. పాపం బీ త్రిజగంబులం గలఁచెడిన్;
బాడయ్యె ధర్మంబు; ప్ర
జ్ఞాపారంబున నే చరించెడి వృథా
గాఁ బండితాలాపముల్;
బ్రాపించెన్ బరమేశ్వరాస్తికతయే
బాధంపు సందేహముల్;
దీపం బెయ్యది సజ్జనాళి కిఁక నీ
వేదక్క, స్కందాంశజా? ౧౮

శా. వైరాగ్యమ్ము త్వదీయవిత్త మగుఁబో,
వారింపఁగా నేర్తువే
కారుణ్యమ్ము? సముద్యమమ్మగునుబో
గర్వ్యమ్ము, పిత్రంఘ్రిసం
స్మారధ్యానము నట్టిదే? వలదు కా
మం, బైన భక్తావనం
బూరీకారము గాదె? యూరుకొనవే
లో, స్కంద, మర్త్యాకృతీ? ౧౯

శా. దూరంబేఁగు, కువాదమా; విడు మిఁకెం
దున్ గుంటు, ధర్మర్షభా;

భూరాజ్యంబును, దుర్భ్రిమా, వదలు; పెం
పుల్ గన్న, సత్సంఘమా;
శూరాంతఃపుర నేత్రపర్వహరుఁ డా
శుంభద్గురు శ్రేష్ఠుఁ డా
గారీయుం డిదె సోదరుం గలసి వే
డ్కన్ జేరె నీ ధారుణిన్. ౨౦

శా. నేనన్ భావము పుట్టు గుప్తపద మెం
దేన్, డిందభేద, మ్మెవం,
డీ నానావిధభూత చేతములఁ దా
నే వెల్గు నెవ్వాఁడు, న
మ్మేనన్ సర్వజగమ్మునం దెసఁగు స్వా
మేయప్రభావమ్ముచేఁ,
దా నొండౌ గురుమూర్తి విఘ్నపతిభ్రా
తన్ బ్రీతిమై గొల్వరే. ౨౧

శా. లోనన్ వెల్పల నిచ్చలున్ దిమిరముల్
పోఁద్రోలు జ్యోతిర్మయ
స్థానమ్మొంది వెలుంగుఁ దా నెవఁడు భ
క్తాజ్ఞాననిర్మూలియై,
తా నీ విశ్వముఁ గన్చు నే పరుఁడుగాఁ
దద్విశ్వపారస్థితుం
డౌ నా శ్రీరమణర్షి లోకగురు స
ర్వార్తిక్షయున్ మ్రొక్కెదన్. ౨౨

ద్వి. సుమధుర మొలయింపు శుభవిలోకితము,
రమణ, యొండిట; సఫలమగు మత్కృతము. ౨౩

రమణ, నీ వఖిలజనమునకు గురువు;
అమలాభిద త్వదీయాశయ మ్మురువు. ౨౪

అరె! నీ నుడి జగదహంపరత్రయము
స్ఫురియించు సదభేదముగ నసంశయము. ౨౫

త్వదుపదేశనిరన్యతత్త్వ మేనొండ,
సదహంభిదావృత్తి జాతె నాయంద. ౨౬

అహము లోపల హృది నమలమాదాని
నహహా! గాంతుము నీ దయారస మాని. ౨౭

కరుణ నీకు గుణమ్ముగాదు, విద్వలయ
వరుఁడ, నీ హృదయదీపము నైజకళయ. ౨౮

నీ తనువు జ్వాలించు నిర్మలద్యుతిని;
నీ తేజరిలుచూపు నెగడు నాయతిని. ౨౯

హృదియందు, నాథ, నీ మది పొందు లయము;
ముదమందు నీ వెసంగుదు వెం దనయము. ౩౦

జగదధిపతివైన భగవంతువసతి
నగుదు పాచకుఁడ వెన్నఁగను, యతిపతి. ౩౧

ఈ నరపశువుల నే నంటఁ జెండి
బానస మ్మొనరింతు పరశివుతిండి. ౩౨

మ. నరచి త్తమ్ముల యంధకారతతులన్
వాగ్దీప్తి నేగాక, స
త్కరుణాపాంగవిలోకనావళుల వే
గన్ సాఁగఁ బర్వించుచున్
బరిమార్పంగ వలంతి వెవ్వఁడు, దయా
పాథోధియౌ నాతనిన్
గురునిన్ శ్రీభగవత్ప్రభావు రమణా
ఖ్యున్ భక్తిమై మ్రొక్కెదన్. 33

తరళము. మునిఁగి మున్గి భవాబ్ధిలోఁ జిర
మున్ శ్రమంపడి డస్సి, నీ
ఘనపదాబ్జయుగంపు దీవిని
గాంచి యియ్యెడ నాశ్రయిం
చిన మమున్ భవదీయభక్తుల
శ్రీనిధీ, రమణా, దయా
ర్ద్రనుత దివ్యకటాక్షవీక్షణ
రాజిచేతను బ్రోవవే. 34

తరళము. జనని యక్కట! చన్నుఁబాల
నొసంగదే శిశువేమగున్?
గనలు నూనఁ బశుప్రభుం డెటుఁ
గల్గెడిన్ బశురక్షణం?
బణఁప వేనియు సంశయము నీ
వంఘ్రి దాసుల, కీ భ్రమా

గణితనిర్జితు లెట్లు దాటఁగఁ
గాంత్రు జన్మము, నో గురూ. ౩౫

తరళము. అమృతరోచిసహోదరామల
హాసమందుఁ బ్రశాంతి, కాం
తిమ దచంచలభూరిదృష్టిని
నిండుశక్తియు, భవ్యహృ
త్కమలదీప్తిని నిత్యనిష్ఠ స
దా వెలిన్ బ్రసరించెడిన్;
రమణదేవ, యెవండు మాని ధ
రాతలిన్ సరి నీకగున్?. ౩౬

శా. ఆలోకంబున శక్తిదేవి యిదె యా
హారించు భక్తాంధతన్;
బ్రేలున్ దామరసాక్షురాణి యిదె యా
శ్రీదేవి వక్త్రాబ్జమం;
దాలాపప్రనిగూఢయా నిదె పరా
ఖ్యాదేవి యా బ్రాహ్మియున్;
జాలున్, శ్రీ రమణా, యెవండు, జగదా
చార్యా, నుతింపన్ నినున్?. ౩౭

మందాక్రాంత. నీపాదాబ్జమ్ములకు,రమణా, నే దవిష్ఠుండనైనన్,
బ్రాపించున్ నా కిదె నెఱితఱిన్ శక్తిలాస్యమ్ము; మేలై
దోఁపన్ నీ శక్తి రవివలెనే దూరగోద్యత్ప్రదీప్తిన్,
వేపాయున్ నాథ, మదివగ, నే విశ్వసింపంగదానిన్. ౩౮

వసంతతిలక. ఎన్నంగ నిస్తులిత మీ యరుణాద్రి కౌరా!
పున్నె మ్మనేక మునిపుంగవ వాసలభ్యం;
బెన్నో మహాస్థలము లీ భువి నుండ, నియ్యా
ద్రిన్నిల్వఁగా రమణదేవుఁడు సమ్మతించెన్. ౩౯

వసంతతిలక. అత్యంతశాంతి పరమాధికశక్తి వైరా
గ్యాత్యద్భుతాప్తి కరుణాతిసమృద్ధి మాయా
ప్రత్యర్థిచిత్తు* ప్రియవర్తన కల్మి, మర్త్య
ప్రత్యక్షలక్ష్య మవురా! రమణర్షి ధాత్రిన్. ౪౦

క. తగ నారసింహవాసి
ష్ఠగణపతి రమణుని ఋషిని స్కందాంశభవున్
స్వగురు భగవాను నిట్టులు
పొగడికొనె నలువది పద్యముల భక్తిమెయిన్. ౪౧

క. ఆ సంస్కృతపద్యమ్ముల
భాసిలు సారస్యమునకుఁ బరవశుఁ డగుచున్
వాసిగ వానిని దెలుఁగున
వ్రాసెను గాశ్యపుఁడు సుబ్బరామాఖ్యుఁ డిటుల్. ౪౨

---

త్తు = జ్ఞానము.

# గీతమాల

## ప్రథమము

### అగ్నిగీతము

ద్విపద. ఈవాక్కులో జ్యోతి యిలదె యల్పమ్మె
దైవమ్ముగాన సంతతము గేయమ్మె. ౧

క్రతువులహోత, విప్రవదనవాసి,
క్షితి హవ్యభోజి, వేదితలవిభాసి. ౨

దహన , వసువవు, శతజ్వాలమాలి;
సహను రుద్రుఁడవీవు, శతశాస్త్రశాలి. ౩

ఈవు వెల్గుచునుందు వేముఖమందు,
పావక, వాఁడిందుఁ బహురాజ్య మొందు. ౪

త్వత్సేవకుఁడ, నా వదనమున మెలఁగు;
సత్సభ మోహలేశము నాకుఁ దలఁగు. ౫

ఏదియు శరణమ్ము లేదు నా కిలను;
ఓ దేవ, యనల, నన్నోమ వేడెదను. ౬

కరమాలి యెవఁడో యాకసమున రాజే;
మఱి కీలి యీతఁడే మహిమీఁద రాజే. ౭

ప్రాతరన్నమున కాహ్వానింత్రు రవిని,
వీతిహోత్రుని సందెవేళ భుక్తికిని. ౮

ద్వి. అమృత, నిన్నే యుదయమున సాయమున
అమరవాగ్దేవి యాహ్వానించుర విన. ౯

హవ్యము సేవింతు, వతిదీప్తకీల,
శ్రవ్యసద్వినుతిగిరాపరిపాల. ౧౦

జన్మము సేయ నశక్తుండ, దేవ;
సన్నుతిఁ గావింతు, శర్మ, నన్ బ్రోవ. ౧౧

పార్థివభూతివి, పచనకారివిర,
వర్ధిల్లు మెఱుమవు, వచనకారివిర. ౧౨

పచనకారివిర గర్భంపు భాండమున,
వచనధారివిర, దేవ, కులకుండమున. ౧౩

ఉదరపాత్రను మెఱయు, కులకుండమునఁ;
బొదలుము జీవమై హృదిని బిండమున. ౧౪

అనల, నిన్ను స్వరూపమును హృదిఁ గనెద;
అనవాప్త భయధామమున శుద్ధిఁ గనెద. ౧౫

ఎతఁడు ని 'న్నహ' మర్థమెంచు నిత్యమును,
గతశోకుఁడై వాఁడు గాంచు సత్యమును. ౧౬

ఏయాత్మస్ఫురణమ్మె యెద బాముఁ బాపు,
ధ్యేయ, మ్మనలదేవ, యీ నీదురూపు. ౧౭

వఱలుదు, వో దేవ, వహ్నివై భువిని;
మెఱుమవై, సర్వద, పరిగొందు దివిని. ౧౮

ద్వి. ఇట నీదుతల్లి యీ యిల యతిపూత;
అట దివంబున దేవి, యనల, నీమాత. ౧౯

నీ కేల వసువు, లనిలసఖా, యిచేట;
నీ కల రుద్రులు వాకులే యచేట. ౨౦

ఇట నరులకు, రాజే, హృది రాజిలెదవు;
అట సురల, వరదా, యాడుకొనెదవు. ౨౧

జ్వలననాముఁడవీవు, జగదీశ్వర, యిట;
అల మఘవుఁడ వీ వతుల ధాముఁడ వట. ౨౨

ద్వయ మగ్ని శక్రులు పామరులకు; ను
భయతను వేకమే పండితులకును. ౨౩

లోకబాంధవుఁ డీ దివాకరుఁ డౌర!
ఓ కృశానుఁడ, నీదు నొక వేషమేర. ౨౪

పావక, దేహి సంపద నుదారమ్ము;
దేవ, శరణు, ధీరధీఁ గూడ నిమ్ము. ౨౫

అవు మగ్ని, వరద, నాకస్త్రమ్మ వీవ;
భువి శాస్త్ర మెల్లను బోధింపు, దేవ. ౨౬

సకలజయమ్ముల సర్వమ్ముఁ బన్ను
సుకల, క్షేమద, మదీశ స్తుతియింతు నిన్ను. ౨౭

ధర హృద్య మగ్నిగీతము గాణపతము
పరఁగు నాద్యము భయహర మిది సతము. ౨౮

# ద్వితీయము.

## గణపతి గీతము

ద్వి. సులలితభద్రాంగు శుభకీర్తిమంతు
నల రుద్రతనయు మహాత్ముఁ గీర్తింతు. ౧

అలుపమే యీ జ్యోతి యధికదీప్త మనఁ
బొలుచు యోగి జనాప్తము కులకుండమున. ౨

వాక్కుల గొప్ప దైవతముఁ గొల్వుండు;
ఇక్కట్టు శతముల నిలను దాటుండు. ౩

ఎతఁడు మఱచు గణపతిని లోకమున,
సత మభాగ్యుఁడు మున్గు నతఁడు శోకమున. ౪

అల దంపతిక్రీడ చలివెల్గు కలనె,
లలి నందనవసతి కుల కుండమున నె. ౫

చెలువు భక్తి, సఖ, విశ్వయువరాజునకుఁ;
గెలన నిడు హృది యోగినుతిభాజునకు. ౬

బొంది నిండె యతండు మూలాగ్నిరూపి;
ఒంద లేఁ డతని నయోగియఘాపాపి. ౭

ఈ యగ్రభుజు సత మ్మెవఁడు ధ్యానించు
నాయమలుని సిద్ధితాయి సేవించు. ౮

ద్వి. కరఁగుఁ దత్కాంతి నేనరుని శీర్షమ్ము
పరితప్త, మాతండు పడయు హర్షమ్ము. ౯

'ఆశీర్షరసధార' యను యోగి యవని
'నా శతసిద్ధిద మమృతసార' మని. ౧౦

ఆరూఢపీఠమూలాఢ్యసరోజుఁ
బేరుకొందు నఖిలోర్వీయువరాజు. ౧౧

అభవజా, యొండొక్క ప్రభనీది పూత,
శుభసుషుమ్నామార్గ సువిహార మాత. ౧౨

సకలభాగ్యస్థలి, సామి, నీకరమె;
ప్రకటభవన్మహత్త్వము నెన్నఁ దరమె! ౧౩

'మన సత్త్వమధిదైవ మన హస్తిముఖుఁడ'
యనుదు రిట్లార్యులో యఖిలార్తిహరుఁడ. ౧౪

హృది వేని భక్తి త్వత్పద పద్మమందు
ఎదో శక్తి వెలయుఁ దద్గదితమ్మునందు. ౧౫

ధూతఘనార్తి వెందు, సురేశ, నీవు,
భూతలిఁ గృతికరమూర్తి వైనావు. ౧౬

సిద్ధ సుప్రీతి నిఁక సేవించు శస్త
సిద్ధినామకలక్ష్మి యిద్ధాబ్జహస్త. ౧౭

శ్రీ నుదారను నాకు శ్రీ మనోహారి
తానొసంగుత సమస్తసుబలధారి. ౧౮

ద్వి. భూరికరుణ శీతభూభృత్సుతా కు
మారుండు సద్విద్యఁ బూరించు నాకు. ౧౯

వారింపు, వారణవదన, కష్టమును;
హేరంబ, యిమ్ము నా కెల్ల నిష్టమును. ౨౦

చరణభాజను నన్ను దురితహారకుఁడు
వరధాముఁ డోము నీశ్వరకుమారకుఁడు. ౨౧

దలితజరాధి నిర్దలితరోగమ్ము
నలవర్చు గజముఖుం డాత్మ యోగమ్ము. ౨౨

క్షమతమ మిమ్ము, కష్టహిమాబ్జమిత్ర,
సమధికప్రాణబలము, హరపుత్ర. ౨౩

నిలుపుము నానోట నిజదివ్య ధాటి;
నిల నజితాసిగా నిడు సిద్ధిచేటి. ౨౪

ఇభముఖా, గాఢభక్తి భజింతునిన్ను;
విభుఁడ, నీశక్తి నావేశింపు నన్ను. ౨౫

ఘనతేజ మిమ్ము కింకరజనమ్మునకు,
గణపతీ, భారత కల్యాణమునకు. ౨౬

ఆశింప దీజన, మ్మఖిలదా, ముక్తి;
దేశహితమున కర్థించును శక్తి. ౨౭

ఈగాణపతగీత మిల విశుద్ధమ్ము
శ్రీగాంచుత భయహారి గణబద్ధమ్ము. ౨౮

# తృతీయము

## * ఇంద్రగీతము.

ద్విపద. మంగళనాముని మంగళయశుని
మంగళరూపుని మఘవంతుఁదలతు. ౧

మంజులద్విపదల మరుదవనీశ,
యంజలి నింపి నీకర్పింతుఁగొనుము. ౨

లలితసంస్కృతమంత్రలాలిత, యిపుడు
తెలుగున ద్విపదల దేవేంద్ర, వినుము. ౩

ఋక్కులోరుచి నిర్జరేంద్రుఁడా, తెలుఁగు
వాక్కులోవిన నీకు నిక్కము తెలియు. ౪

భువనముసృజియించి భువనాదిపరుఁడు
భువనాంతరాత్మయై పురుహూతుఁడయ్యె. ౫

భువనాది యున్నాఁడు భువనముదాటి
భువనాంతరాత్మ యీభువనమునందు. ౬

భువనాంతరాత్మకు భువనాదితోడ
వ్యవహారదశయందె యరయభేదంబు. ౭

ఆత్మయే భువనాల కాదిమూల మగు;
నాత్మయే భువనాంతరాత్మయైయొప్పు. ౮

* ఇది కావ్యకంఠ గణపతిమునుల సొంతయనువాదము

ద్విపద. అతఁడు దానొక్కఁడే యావల వెలుఁగు;
నతఁ డుండు నిక్కడ నఖిలముఁ గూడి. ౯

అది మూఁడుపాళ్ళఁట అభవురూపాన;
నిది యొక పాలఁట ఋషులు గన్గొనిరి. ౧౦

అది నిర్గుణంబగు నవికల్పచిత్తి;
యిది సగుణంబగు నింద్రవిభూతి. ౧౧

నిరుపాధి యచ్చట నిర్గుణబ్రహ్మ;
కరుణాసోపాధియౌ పురుషాత్ముఁడిచట. ౧౨

అతఁ డతీతుండగు నఖిలాండములకు;
నితఁ డేలు శక్తిచే నీదృశ్యకోటి. ౧౩

ఆత్మయే లోకమౌ నావలఁజూడ;
నాత్మకు లోకము లంగము లిచట. ౧౪

ఆధారమాత్రమే యాతఁడన్నిటికి
నాధికారిక దేవతాత్మయితండు. ౧౫

విభుని రెండువిధాల విశ్వకారణుని
విభజించిచెప్పిరి విద్వాంసులిట్లు. ౧౬

జనులార, బ్రహ్మము జంభాంతకుఁడును
జనకుఁడు కొడుకును జతురులభాష. ౧౭

భువనము సకలముఁ బుట్టించువాని
భువనప్రవేశము పుట్టుకయనిరి. ౧౮

ద్విపద. అట్టిచిత్రంబగు పుట్టుకయందు
పట్టికి నీదేవ పదవియే తల్లి. ౧౯

అదితి నీతల్లి యీ యాకాశసతియె
సదయ, నీతండ్రి కశ్యపుఁడు బ్రహ్మంబె. ౨౦

ఖండము దితియగు ఖవిశాలవాటి;
ఖండవిహీన యాఖండల యదితి. ౨౧

పశ్యకుఁ డక్షరవ్యత్యాసరీతిఁ
గశ్యపుఁడయ్యెను గవిసూక్తులందు. ౨౨

కవియు విప్రుఁడునగు కశ్యపుఁడన్యుఁ;
డవనిఁబుట్టినవ్యక్తి యజర, నీబంటు. ౨౩

జనకుని నీకిట్లు జననితోఁగూడ
ఘనవాహ, సుకవులు గల్పించిరయ్య. ౨౪

ఆత్మయే శక్తుఁడౌ, నాత్మయే శక్తి,
యాత్మశక్తివిభేద మౌపచారికము. ౨౫

ఆత్మమహాబ్ధిలో నభిమానియైన
యాత్మాణిమాంశమే యగును శక్తుండు. ౨౬

ఆ పయోరాశిలో ననుభూతియైన
వ్యాపకమహిమయే యాతనిశక్తి. ౨౭

సత్తులో మూలమే శక్తిభాగంబు
సత్తులో శాఖలే శక్తిభాగంబు. ౨౮

ద్విపద. ధర్మిభూతజ్ఞాన తత్త్వ మొకండు;
ధర్మభూతజ్ఞాన తత్త్వ మింకొకటి. ౨౯

విభజనాశక్యము విబుధోక్తులందు
విభజింపఁబడి యిట్లు ద్వివిధమైతోఁచు. ౩౦

వాక్యనిష్ణాతల వైఖరివలన
నైక్యాన భాసించె నజ్ఞులకు భిద. ౩౧

పరపురుహూతుల భాగించినట్లె
యిరువురశక్తుల నిరుశక్తులనిరి. ౩౨

ఆమె విశ్వాతీత యానందరూప,
యీమెవిశ్వంబున కీశ్వరురాలు. ౩౩

అతఁడే యీతఁడై యఖిలమునేలఁ,
నాతనిశక్తియే యీతనిశక్తి. ౩౪

శక్త "శక్రా"ఖ్యలు సదృశార్థకములు,
శక్తి "శచ్యా"ఖ్యలు సదృశార్థకములు. ౩౫

అండాలఁబాలించు నాఖండలుండె,
మండలాంతరవర్తి మహనీయుఁడయ్యె. ౩౬

బ్రహ్మాండజాలము పాలించు నతఁడు,
బ్రహ్మాండమొక్కటి పాలించు నితఁడు. ౩౭

పురుహూతసవితలు పూర్వులభాష,
హరకేశవులువీర లధునాతనోక్తి. ౩౮

ద్విపద. ప్రతిబింబరూపానఁ బ్రతి దేహియందు
ప్రతిఫలించితి వీవు పరమేశ, యిచట. ౩౯

ఉన్నావు మూలోన, యోగులవలన
విన్నాము, వినిమేము వెదకిచూచితిమి. ౪౦

వెదకెడుబుద్ధికి వేఱౌదువీవు,
వెదకగ వెదకగ విబుధేంద్ర, తెలిసె. ౪౧

నీవు నీమదినైన నిఖిలేంద్రుకంటె
నీవు భిన్నుండవు నిజము, మానవుఁడ. ౪౨

ఆక్రమించెడునప్పుడహమును మనము,
శక్రుఁడంతర్యామి సలుపఁడుచర్చ. ౪౩

గుహలోపలకుబోయి గుప్తదేవునకు
నహమును మానస మర్పింపవలయు. ౪౪

అది వానిసొత్తగు, నది గాదు తనది,
మదియట్లుసేయుట మహిన్యాయమగును. ౪౫

అతనివస్తువుదెచ్చి యతనికియ్యకయె
సతతమువాడుట సరిగాదు మదికి. ౪౬

ఆపాపమే మూల మఘములకెల్ల;
నాపాపము భవాన నందఱఁగట్టె. ౪౭

ఆపాపమే యుత్తమాధమవాది;
యాపాపము హసించు నద్వైతబోధ. ౪౮

ద్విపద. అడుగఁగఁదనసొత్తు నాతండురాఁడు
విడువదుచిత్తము వెఱ్ఱియైతాను. ౪౯

మనసుచూఁచినఁదాను మఱిచూడలేడు;
మనసుచూడఁగలేదు మఱితానుజూడ. ౫౦

ఇది తాను వీక్షింప నది శయనించు;
నది తాను వీక్షింప నిది లయమందు. ౫౧

ఒక్కటి శిరసుననుండి భక్షించు;
నొక్కటి హృదయాననుండి వెలుంగు. ౫౨

భక్షించి భక్షించి పరితృప్తిలేక
శిక్షించిమమ్మిది చేయించుఁబనుల. ౫౩

దీనిరాజ్యంబున దీనులౌమమ్ము
దీనావన! మహేంద్ర! దేవ! కాపాడు. ౫౪

మాశక్తిలేకయే మఱిసాఁగలేదు
మాశక్తినిహరించి మమ్ముబాధించు. ౫౫

మేముభాసింతుము మేముందుమయ్య,
మామనస్సునకెంచ మాకేమి మేలు. ౫౬

ఈప్రకారంబున నీతిబాధలును
నీప్రతిరూపము ల్నిత్యముపడగ. ౫౭

శోచింపకేమియు సురరాజ, దివిని
చూచుచునుండుట శోభయానీకు? ౫౮

ద్విపద. నిన్ను నన్నుఁ గఁజేసి నిర్జరనాథ,
మిన్నునఁ గూర్చుండి మే లెంచ వేమి? ౫౯

ప్రతిబింబమునఁ జిత్తి ప్రసరింప నేల?
పతితపావన, దాని బంధింప నేల? ౬౦

తనరూపు బంధింపఁ దన కేది యశము?
ఘనవాహ! నీవిది గమనింప లేదా? ౬౧

చేదైన విషయాలఁ జిత్తము విడిచి,
నీదు ప్రక్కకు వంగి, నిర్జరేశ్వరుఁడ, ౬౨

యోచింప యోచింప నుదయించు శక్తి,
యాచింప యాచింప నలవడు భక్తి. ౬౩

తలనుండి స్వహృదయ స్థలముఁ జూచుటయె
బలవైరి ప్రక్కకు వంగుట యగును. ౬౪

తన మూలమును బుద్ధి తర్కించు టొకటి
తనబుద్ధి నే తాను దర్శించు టొకటి. ౬౫

నిన్ను భజించుట నిఖిలేంద్ర, యగును
దన్ను విడిచిన నేది తపసు లోకాన. ౬౬

ఆత్మప్రతీతియే యప్రమాదమగు;
నాత్మను మఱచుట యగుఁ బ్రమాదంబు. ౬౭

అప్రమాదము యోగ మన్నింటికన్న;
నప్రమత్తుఁడు నిన్నె హరిహయ! చేరు. ౬౮

నినుఁ జేరుటయనంగ నిర్జరనాథ,
తనయందు నిల్చుట తాత్పర్యమందు. ౧౯

తనపట్టువిడుచుచుఁ దలఁచుట భవము;
తనపట్టువిడువక తలఁచుటతపము. ౨౦

తనచోటనుండుట తలఁపులులేక
ఘనవాహ! నీయందుఘనమగునిష్ఠ. ౨౧

చూపునేచూచెడు శుద్ధయోగులకుఁ
బాపహారిపరుండు ప్రత్యక్షుఁడగును. ౨౨

కొండనాలుకబుద్ధి కూర్చుండనిండు
పిండాననిది శక్రవేశ్మమునుండు. ౨౩

ఆధారమందలి యణువైనయగ్ని
యాధారముగదృష్టి నతియుక్తిదింపి. ౨౪

చింతింపు మింద్రుని జిత్తమువంచి
సంతత మది పంథ సర్వసిద్ధులకు. ౨౫

ప్రాణనిత్యవిహార పరిశోధకుడగు
ప్రాణి కింద్రునిశక్తి ప్రత్యక్షమగును. ౨౬

శక్తునివిశ్వప్రసారిణిశక్తి
భక్తునితనువులోఁ బ్రవహించుఁగాత. ౨౭

# చతుర్థము

## వాయుగీతము

దైవపతితుఁడ మందనరబృందమునఁ;
బ్రోవ మ్రొక్కెద సమీరున కీ యదనున. ౧

తారకాసుమ ముత్పతత్ఖగకులము,
మారుత, నీతోఁట యౌర! యాకసము. ౨

బలదేవుఁడవు నీ వఖిలపుఁ బ్రాణమవు;
ఇల నీ మహిమ నెన్న నెవరితర మవు? ౩

నీ భక్తి కెద్ది సన్నిభము పుణ్యమ్ము?
ఆభక్తి రైక్వునిఁ దగుఁ బవిత్రమ్ము. ౪

మితము నాక; మలంతి కుతలలోకమ్ము;
అతిశుభ్ర మమితి, మారుత, త్వదభ్రమ్ము. ౫

మ్రోవ రుద్రుఁడవు; డంబునను శక్రుఁడవు;
వీవ వాతమవు; త్రివిధ సన్నుతుఁడవు. ౬

నీకైనె దిక్కులన్నియును, వ్యోమేశ;
ఏకకోణపుఁ డని యిల భక్తభాష. ౭

శ్రమఁ దీర్చుకొను మోయి, సతతపర్యటన,
విమల వాసిష్ఠ వాగమృత మానుటన. ౮

అనలున సంపన్ను లన్నముల్ వేల్తు;
రనిల, యీ నుడులు నీయందేను వేల్తు. ౯

గగనేశ, గుప్త మౌఁ గాక నీవేష;
మగుఁ గాదె సువ్యక్త మౌర! నీఘోష. ౧౦

అభ్రహర్మ్యముల నీ వాత్మసురలకు;
శుభ్ర వీర్య ధనకోశుఁడవు నరులకు. ౧౧

నిను విద్య సంవర్గ మని రైక్వుఁ డనియె;
ఘనుల యాత్మను వగల్ కడతేర్తువనియె. ౧౨

దేవ, తపోమూల మీవె ఋషులకు;
ఈవె యిలను హేతువెల్ల కృషులకు. ౧౩

ప్రాణదానార్థ మాప్తభువిరంగములు,
ఖేన, యీ నీ వాతకృత్తరంగములు. ౧౪

మరుదాత్మ, యాలపింతు రెవరైన నిను;
ధరరాజవనుదురు, తండ్రియందురును. ౧౫

త్వదభినుతి, మరుదాత్మ, పృషదశ్వుఁ డని,
త్రిదివేశ్వరుండుఁ దండ్రి నిగమాశ్వుఁడని. ౧౬

నీవీచి వాతము, నెమ్మేను మెఱపు;
నీవాక్కు తారము, దేవతల్ తలఁపు. ౧౭

తార మనాది వేదాది ప్రణవము
ధారణ గొని పొందెదరు నీ ప్రణయము. ౧౮

అధిభూతవిధి వాత, మాయధిదైవ
విధి శక్రుఁ, డధిపిండవిధి రుద్రుఁ డీవ. ౧౯

తనుమధ్య వృత్తమ్మునను కవిరాజు
ననుగీతము లివి గైకొనుత ఖరాజు. ౨౦

# పంచమము

## సూర్యగీతము

ఆటవెలది.

ముజ్జగముల రాజు మూర్ధజంబుల మధ్య
వెలుఁగు మణి యితండు వేడివెల్గు,
ముజ్జగముల మించు మూల్యమ్ము గలయట్టి
యీడులేని కలిమి నిచ్చుఁ గాఁత. ౧

చండకిరణదేవు మండల మ్మిది మీఱు
వెలుఁగు తావుగాను, వేదనిధిగ,
వేళవేళ కెలమి విప్రవంద్యమ్ముగా,
విశ్వజీవమునకు వేశ్మముగను. ౨

శివుని కేశమందు స్వవపువుఁ బొరసియుఁ,
దల్లి శ్రోత్రమందుఁ దనువుఁ దాల్చి,
నెగడెదవు, సరోజినీప్రియ, దంపతి;
నవుదు భూషణంబ వావరుసను. 3

నిన్ను భర్తకుఁ గుడికన్నను నొక వేత్త;
యొరుఁడు పల్కు మూర్తి యొం డటంచు;
భవన మను నొకండు; భువన మన్యుండనుఁ;
ప్రాణ మనుఁ బరుఁడు, సహస్రకిరణ. ౪

మనును నీదుచేతఁ, గనును నీచేతనే,
పుడమి నీదుచేతఁ గుడుచుఁ, ద్రావు,
మెఱయు నీదుచేతఁ, దరణిరో, నీమహా
భాగ్య మిట్టిదనుచుఁ బలుకఁ దరమె? ౫

ఇలను బ్రదుకు మనకు హృదయ మేలాగొ, యా
లాగె పతికి మండలం బిదాను,
దీని నందువలన, దృష్టాంతచిత్రమా
శిష్టతతి హృదయ సమష్టియనును. ౬

మండలంబుమధ్య నిండారు నా జ్యోతి
హృదయమధ్యమందు నెసఁగు జ్యోతి
యల్ల నీది యిట్టు లక్షిగమ్యము నాకు
రమ్యతరము పూర్ణ కామ్యమార! ౭

ఉర్వి బహుళజుష్టమొక్క క్షేత్రమం
దక్షిబింబమధ్యమందుఁ దోఁపఁ,
గష్టము గలితంబ, యిష్టము ఫలితంబ,
యేమికోదువ మిగులు నింక నాకు? ౮

చూపు నిలిపి యక్షిలోపల సాక్షిని
నిర్మలాంబరమున నిలకదారి
రాత్రిఁ గూడఁ గానరానగు దిననాథుఁ
జూడ, నశ్యమెల్ల సురిగి పోవు. ౯

నరుల కోరికలకు ధర సంజీరక్షుడై
కంటియందు మేలుకనును రాజే;

సురల కోరికలకు వఱువాయిరక్తుఁడై
యీ రవిని వెలుంగు నీశ్వరుండు. ౧౦

జ్ఞానరూపమనుచుఁ గనుటనో తేజమ్ము,
స్వర్ణమయము పురుషు ప్రతిఫలనముఁ
దనదు నయనమందు ధ్యానించుటనో, ధీరుఁ
డఖిలబంధముక్తుఁ డగును సుకృతి. ౧౧

నిహతపాపమైన దహరపద్మమ్ములో
నెల్ల సిరులతోడ నెసఁగువాని
నవనిలోనఁ బుణ్యు లా కిరణాంగుష్ఠుఁ
బ్రోదిఁ గాంతు రల పురుషమణిష్ఠు. ౧౨

అవనియందు వహ్ని, యాకసమ్మున రవి,
స్వర్గలోకమందు శక్రుఁడనుచు,
నాత్మజోతి వేకమగు నిన్ను బుధులంద్రు
భువనభేదముబడి త్రివిధముగను. ౧౩

దివ్యవిభవశాలి భవ్యదీధితిమాలి
లుప్తపాపుఁడును ద్రిలోకదీపుఁ
డాకసమున నెసఁగునారవి, యట నీశు
పరమమైన జ్యోతి వచ్చుఁ బోవు. ౧౪

జయము తరణికి దశశతధామతనునకు,
జయము తత్ప్రదేశసంస్థితునకుఁ
బరమధామున, కిలఁబాదాకులకముల
గణపతిమునిరచితమునకు జయము. ౧౫

# షష్ఠము

### దశావతార గీతము.

సుగంధి. వేదచోరు సోమకాఖ్యు వీఁకసంహరించి ము
న్నాఁదటన్ గుమారభాస్వదర్థమా ధ్రువన్ స్మృతిన్
బ్రోది నిచ్చి సింధువారిఁబొల్చు తాపసాప్తుఁడౌ
నీ దృశున్, సఖా, భజింపు మీష వేషు నచ్యుతున్. ౧

మందరాద్రిధారి నాకమాళికార్యకారి మా
నిందుచిత్తభూవిహారి హేయపాపహారి యా
శ్రీందిరాత్మనేతకున్ హరిల్లతాంతకీర్తికిన్
వందనమ్మొనర్పుమా యవాప్తకూర్మమూర్తికిన్. ౨

దిక్కటాహముల్ దహించు దీప్తతారతీంద్రముల్
గ్రక్కునొక్క వేడిచూడ్కిఁ గాంచనాక్షుఁ గూల్చి, వే
ఱొక్క మెత్తచల్లచూడ్కి నుర్విఁ దన్పుఁ దానెవం,
దక్కిటేంద్రవేషధారి నా హరిన్ స్మరింపుమా. 3

సారశక్తిపౌరుషప్రచండరోషదీప్తుఁడై
పారఁద్రోలె, ఱొమ్ముగోళ్లవ్రచ్చి, దైత్యుప్రాణముల్,

ధీరదానవాళి పెంపు, దేవచిత్తభీతి, నా
శౌరి నారసింహమూర్తి చక్కడంచు నీ వెతన్. ౪

వీఁకమై పదత్రయమ్మొ వెట్టి యాక్రమించెఁ దా
నేకమంగుళమ్ము నిల్ప కెందు నందు నెల్లెడన్
నాకచారిపాలనమ్మొనర్పి దైత్యసంపదన్
గైకొనంగ, నట్టివామనావతారుఁ గొల్వరే. ౫

దుర్జయార్జునున్ జయించె దోర్బలంబునన్, మన
స్స్వార్జనన్ దిరస్కరించి యాసముద్రధారుణీ
వర్జనన్ జయించె నైజవాంఛ, నా రమామనః
స్ఫూర్జితుండు రైణుకేయ భూమిసుండు ప్రోచుతన్. ౬

కన్నతండ్రిమాటఁజెల్లఁగన్నబిడ్డ, రాజ్యకాం
తన్నితాంతమోమురాజు, తమ్ములందు బల్దయన్
గొన్న తన్నియంత యన్న, కుత్సితారి, సత్సుఖం
డన్నరుండు సీతభర్త యచ్యుతుండు కాచుతన్. ౭

ఓర్మిమై ధరాభరంబు నూడ్ప యాదవేశుఁడై,
నర్మలీల శైశవమ్మునన్ సువిస్మయం బిడెన్,
భర్మచేలధారి చక్రి పార్థసూతుఁ డెవ్వఁడా
కర్మయోగ దేశికుం డఖండశర్మ మిచ్చుతన్. ౮

భారతమ్మె గాక యీ ప్రపంచ మబ్ధిముద్రితం
బార! తా నలంకరించె, నాత్మసద్గుణాళి, నా

పూరుషోత్తముండెయైన బుద్ధనాముగాథ యిం
పారుతం బవిత్రమై వియన్నదీవిధంబునన్. ౯

తళ్కులొల్కునర్కబింబధాము, నాదిపూరుషున్,
బల్కృపన్ మహీతలమ్ముఁ బాలనమ్మొనర్చు నా
కల్కభారవారణార్థి కల్కిభూమికాధరున్
బల్కు పావనమ్ముగాఁగఁ బాడుఁడీ భజింపుఁడీ. ౧౦

# సప్తమము.

## అంబికా గీతము.

పదసేవ కాఘమ్ముఁ బాపు దైవమ్ము,
మదిగోరిన ఫలమ్మమర్చు దైవమ్ము,
సన్మార్గులను బ్రోచు జాణ దైవమ్ము,
ఉన్మార్గుల నడంచు నుఱుము దైవమ్ము. ౧

భానుమండలసుదీప్తమ్ము దైవమ్ము,
తా నేత్రమధ్యసుప్తమ్ము దైవమ్ము,
ధవళాంశుబింబగుప్తమ్ము దైవమ్ము,
అవవియాత్రిగుణమయమ్ము దైవమ్ము. ౨

అతివేలచేటీసహితము దైవమ్ము,
ధృతరేణుసంఘవిహితము దైవమ్ము,
అతులాభ్రసౌధనిహితము దైవమ్ము,
తతభైరవముఖాభిహితము దైవమ్ము. ౩

అసువుల రుచిఁ గూర్చునదియె దైవమ్ము,
వసురుద్రరవిగీతవరము దైవమ్ము,
క్షితిజలాగ్నులలోని చేరు దైవమ్ము,
శితమతులగువారి చేర్పు దైవమ్ము. ౪

మదిమెత్తవారి సౌమ్యమ్ము దైవమ్ము,
మదనసుందరుల రమ్యమ్ము దైవమ్ము,
పరతత్త్వవిదుల విశ్వమ్ము దైవమ్ము,
అరుచిత గుణుల శూన్యమ్ము దైవమ్ము. ౫

ధర శక్తిచేతఁ గదల్చు దైవమ్ము,
మెఱపుజోడను జూడ మెఱయు దైవమ్ము,
* ధేనుమను సువాచ్యమౌను దైవమ్ము,
ఆనతానందదం బగును దైవమ్ము. ౬

కోనకోనను మెలంగునది దైవమ్ము,
కాన కానఁ జరించుఁ దాను దైవమ్ము,
ధర నూర నూర ఖ్యాతమ్ము దైవమ్ము,
పురపురమ్మునఁ బేరుఁ బొరయు దైవమ్ము. ౭

ఆకాశమందు శూన్యమ్ము దైవమ్ము,
నాకస్థ శచి రూపెనయును దైవమ్ము,
వలికొండగౌరిరూపమ్ము దైవమ్ము,
ఇలఁ దనువులఁ బ్రాణ కలన దైవమ్ము. ౮

మేరుధన్వికి సగమేను దైవమ్ము,
ధారుణిత్రయపూరితమ్ము దైవమ్ము,

* ధేనుమంత్రము=“హూం”=చండి.

జీవాళి హృదిని గించిత్తు దైవమ్ము,
భావమ్ములముఁ బూరిపగిది దైవమ్ము. ౯

ధర † లజ్జయన లలితమ్ము దైవమ్ము,
మఱి ‡ రసనయన భీమమ్ము దైవమ్ము,
మలఁగక చూడ సూక్ష్మమ్ము దైవమ్ము,
లలి విషయాళి స్థూలమ్ము దైవమ్ము. ౧౦

అన్ని స్తోత్రములఁ దియ్యనగు దైవమ్ము,
ఎన్న ధ్యానముల మత్తిడును దైవమ్ము,
ప్రతినమస్సున వరప్రదము దైవమ్ము,
ప్రతి చరిత్రను బవిత్రమ్ము దైవమ్ము. ౧౧

తారాపథామలతనువు దైవమ్ము,
తారార్క చంద్రనేత్రమ్ము దైవమ్ము,
చారకపవనశ్వసనము దైవమ్ము
వారినిధిస్వేద మూర ! దైవమ్ము. ౧౨

పరఁగు లీలాంగనాపాత్ర దైవమ్ము,
వరహిరణ్మయభూష వఱలు దైవమ్ము,
ఒకకొందఱకును బోషకము దైవమ్ము,
ఒకకొందఱకును శోషకము దైవమ్ము.

---

† లజ్జ="హ్రీం"=భువనేశ్వరి. ‡ రసన="క్రీం"=కాళి.

తనపోషవిధిని శీతమ్ము దైవమ్ము,
తనశోషవిధిని దపనము దైవమ్ము,
తనసర్గవిధి వికసనము దైవమ్ము,
తనప్రలయవిధి మీలనము దైవమ్ము. ౧౪

భువిసోమమును ద్రావి పొదలు దైవమ్ము,
అవిహితుల వధించి యలరు దైవమ్ము,
భువనప్రలయమందు మివులు దైవమ్ము,
ప్రవర మఖిలపదార్థముల దైవమ్ము. ౧౫

కయిపు కౌలాచారులయెడ దైవమ్ము,
నయ సమయులకు శాంతమ్ము దైవమ్ము,
నయ యోగులందుఁ బీనమ్ము దైవమ్ము,
లయము జ్ఞానాచారులయెడ దైవమ్ము. ౧౬

మనసిజారికళత్ర మనఁగ దైవమ్ము,
గణపషణ్ముఖపుత్త్రికమ్ము దైవమ్ము,
అనఘప్రదమ్ము పావనము దైవమ్ము,
మునిమతమ్ము జయమ్ముఁ గనుత దైవమ్ము. ౧౭

# అష్టమము.

## రేణుకా గీతము.

ద్విపద. సురశిరస్సంచరచ్చరణ రేణుకకు
సరవి భూరాణికి జయము రేణుకకు. ౧

దేవతావళి శిరోదేశ లాలితము
దేవి రేణుక పదమ్మాశ్రిత ముదము. ౨

కుండలీ మండన గూఢ తేజమ్ము
హిండితమ్మాత నా హృదిని సతమ్ము. ౩

వస్తువు నిత్యమ్ము మస్తకైతవము
శస్తదమ్మగుత స్వాశయమున సతము. ౪

ఆదినారీ, త్వదీయాంఘ్రిపంకజము
నాదు చిత్తాబ్జమ్మునను దోచె సతము. ౫

ఔదుఁ గేవలము త్వత్పాదభక్తుఁడను;
వేదసన్నుత, యన్యమేది యెఱుఁగను. ౬

నెఱిదగు, హృదయమా, నీ యణువునకుఁ
బరిచయ మంబికా పాద రేణువుకు. ౭

శరణమ్మిడుము గాక జాఱఁగా విడుము,
సురవంద్య, విడువ నీచరణపంకజము. ౮

ద్విపద. అడియఁడౌ నెవఁడు నీ, కమ్మ, ధన్యుండు,
కుడుచునే క్రమ్మఱఁ గుచము లాతండు? ౯

అహరహమ్ము భవద్రహస్యచింతనను
అహహా! ధన్యుఁడ, నంబ, యన్యమ్ముడుగను. ౧౦

స్మరజేతశిరమున జాహ్నవి గతిని,
గరుణ, రేణుక, నీకుఁ గలదమ్మ మతిని. ౧౧

ఓ దంభతపసి, నన్నాదుకోవమ్మ,
పాదపద్మాదిసేవకుఁడను జేమ్మ. ౧౨

ఓ పుణ్యకీర్తనా, యురుకృపాశీల,
నీ పుత్త్రికుని నన్నుఁ గాపాడ వేల? ౧౩

జననిరో, జంభారి సన్నుతవీవె,
ఘన విపన్మగ్నుని ననుఁ గానరావె. ౧౪

సత్వశాలిని, యజా, సత్స్వరూపిణిగ
తత్త్వవేత్త లెఱింగెదరు నిన్ను సరిగ. ౧౫

వేదవేది సదయవీక్షణరో, నిను
మోదరూపిణిని గానే దాను గనును. ౧౬

వరమాత, పరమదేవత, జ్ఞానముగను
పరమయోగు లెఱుంగుదురుగాదటెనిను. ౧౭

వరమాత, కుండలీపురనివాసినివె;
పరశురాముని గాంచుకరణిన్ గనవె. ౧౮

ద్విపద. జననీ, సురార్చితా, శ్రవణశాలినివె;
తనయురోదన హృది దయపుట్ట వినవె. ౧౯

సుతుఁడ, యాచకుఁడఁ, గోరితి నీభజనము;
అతిదుర్లభంబయ్యె నద్ది సయితము. ౨౦

ఛిన్నమస్తక, వద్దు జీత మేమియును;
ఇన్నిభజనమె నాకీవమ్మ దయను. ౨౧

ఆలోలతారమై యబ్జంపుఁ బొడవుఁ
జాల జాలియుఁ గల్గి చల్లఁగాఁ బరువు ౨౨

మేలి చూపే, రేణుకా, లీలఁ జూడు;
మేలగు నాకు, నీకో లేదు కీడు. ౨౩

సుర విలాసినులె దాసులు నీకనయము,
వరకుండలీపురవాసినీ, జయము. ౨౪

సన్మధురమ్ము నీ చరణ పంకజము;
తన్మతుల్ విడుతురో తల్లి, యఖిలము. ౨౫

నా హృదిఁ జరణమ్ము నడపింపు, మమ్మ;
ఈహ, యనామయా, యిదె నాకుఁ జుమ్మ. ౨౬

భుజగకంకణధారిముఖ్య సన్నుతవె;
భుజభువారిజననీ, ప్రోవరాఁ గదవె. ౨౭

స్మయకుండలీపురీ మండనాయితకు
జయము గణపతి ప్రశస్త రేణుకకు. ౨౮

# న వ మ ము.

## గు రు గీ త ము.

సీ. ఈ వ్యక్తమెల్లనే యవ్యక్తమునఁ బుట్టె,
నెం దిది సతముండు, నెందు డిందు, ౧

లక్షల గోళముల్ కలుగు బ్రహ్మాండమే
యసమబలాధారమందు నిలుచు, ౨

ఎదియీను రవ్యాద్యహీన తేజస్సుఁ, ద
ద్బ్రహ్మాది సురశక్తిఁ, దానె శక్తి, ౩

దేని వెల్గునఁ దత్త్వ దృక్కులౌదు రసంగు,
లౌ నల్పధీ ద్వయి దేనిమాయ, ౪

దేనిధ్యానమిదు స్వాత్మానంద, మెట నిల్వ
నగు ముక్తి, వేదతద ర్థమెద్ది, ౫

అట్టి ప్రణవపరబ్రహ్మ మస్మదంత
రంగమున నా ప్రియము రమణాఖ్యఁ దాల్చి
నవనవమ్ముగ నాదు ధ్యానమునిమిత్త
మెల్ల వేళలయందు భాసిల్లుఁ గాక. ౬

సీ. మొదల మూలాధారమున వెల్గుదన్ని హృ
దయకమలమ్మునఁ దా వసించి

తరువాత శీర్ష పద్మమునకు బాఁతి యౌ
పైన నింద్రియశక్తు లీను నెద్ది, ౭

యటఁ బరాచీ దృష్టి నెది తనుభ్రమకారి,
స్వాత్మైక్యము పునరావర్తిత మెది, ౮

విషయముల్ గనుచున్న విశ్రమించిన నెది
లో నేకవృత్తి నిల్చుటనె ముక్తి, ౯

రమణ నామమ్ము చెలువుమీఱంగఁ దాల్చు
నమల మల్లయాత్మజ్యోతి యనవరతము
నస్మదీయ విస్ఫుట హృదయాంబుజమున
నెసక మెసఁగుచుఁ దా స్ఫురియించుఁ గాత. ౧౦

తే. రమణుఁ డనుపేర నొప్పు దీపమున నుండి
వెలువడుచు నెద్ది గణపతిపలుకు లనెడు
కుడ్యములయందు గీత నాఁ గొమరు మిగులు
చిత్రరూపమ్ముఁ దాల్చె విచిత్ర లీల, ౧౧

కాంతిపుంజమ్ము చేత నజ్ఞాన మనెడి
చిమ్మచీఁకట్లఁ దా నెగఁజిమ్మ నలఁతి
యెది, యల తత్త్వము స్ఫురియించుఁ గాత
మా కగు ప్రణవధ్యాన సమాధియందు. ౧౨

సీ. వరుస నాధారములయందు శిరమునందు
రాకపోకల నెడు విహారములచేతఁ
జేయు సంచారము, మఱి యశేషమందుఁ

బర్వ్వనెది, నిరాలంబ మంబర సమంబు
సుపరిపూర్ణంబు శబ్దసంశూన్య మెద్ది,
యల్ల గురు రూపమగు బ్రహ్మ మెల్లవేళ
నాకు స్ఫురియించుచుండును గాక హృదిని. ౧౩, ౧౪

గీ. దేని తత్త్వమ్ము వీనుల నానినంత
నెసఁగు నల పరోక్షజ్ఞాన, మింకను దేని
యమల సాంగత్య మపరోక్షమైన జ్ఞాన
దీప్తికారణ మగుచుండు, దేని చింత
స్థిర విముక్తి నొసఁగు, నియ్యది రమణాఖ్య
మైన బ్రహ్మమంతటను నన్నావరించి
యంచితానంద జలధిలో ముంచుఁ గాత. ౧౫, ౧౬

క. తారానందునిచేతఁ
బ్రేరితుఁడై, యతని మతమెఱిఁగి, దీపిత గం
భీరము గురుగీతముఁ బ్రియ
మారఁగ వాసిష్ఠుఁ డిట్టు లాలాపించెఁ ౧౭

# దశమము.

## యోగసారగీతము.

పదనైన బుద్ధిచే హృది నిభాలనము
అదె జగదీశ్వర సదన శోధనము. ౧

దహర మజ్జనమాడి ధన్యమా జనము
బహుళ సంపదఁ గాంచు నహహా! ధీపదము ౨

నేనన్న స్మృతి జని స్థానమ్ముఁ జేరు;
ఈనీదు భవగాథ యెల్లను జాఱు. ౩

తనలోపలికిఁ జూడ్కి తాఁ బర్వఁగానె?
జనవిషయాసక్తి చేనరుండు కానె ? ౪

అక్షిసంద్రుశ్యద్వయాంతరాంబరము
వీక్షింపుచు, భజింపు విభుఁడైన పరము. ౫

విషయముల్ విడి స్థిరవిషయిని బొలుచు
ధిషణున కెట్టి సిద్ధియుఁ గేల నిలుచు. ౬

అనయమ్ము మనము రసననీర మొందఁ,
దనరు సుఖము నిశ్చితము కరమంద. ౭

తలవల్లఁ గనుదము కులగృహానలము;
ఇల నెల్ల స్మరణ మిట్టులు దాటఁగలము. ౮

తలఁపన్న నేయిచేఁ గులభవన శిఖి
జ్వాలియించు నెవని, కీ యిల నతండె మఖి. ౯

శశి ద్రవింపంగఁ గులశిఖి తేజమునఁ,
బ్రశమించు మనత్కృప పరమామృతమున. ౧౦

స్మరణయుక్తమ్మౌ శ్వాసనయాత్ర గాఁగఁ,
జరతమ చిత్తమ్ము శమియించు వేగ. ౧౧

స్మృతి తనమదిని విచ్యుత గాకయున్న,
సతి సులభ ప్రాప్తమగు యోగమెన్న. ౧౨

సతము సహస్రారగతము వేనిమతి,
అతఁడు మహి మహిమాఢ్యుండు నిరతి. ౧౩

ఒగిఁ జతుష్పథనిష్ఠ నొందు నాతండు
జగదుదంత ధర తేజమున లీనుండు. ౧౪

స్మరియింపు మోరోరి! స్వవపువుత్తరము.
అరయ లోఁ బడును నీ కది మహత్తరము. ౧౫

పరశక్తి కర్పింప స్వకము వపువును,
అరరె! గాంచెద వేదా యత్యద్భుతమును. ౧౬

కరణశక్తి విహుండు మెఱయును గృతుల,
చరణశక్తి విదుండు పరఁగును గతుల. ౧౭

వినికిశక్తి గలాఁడు తొనకండు శ్రుతుల,
మననశక్తి విదుఁ డేమఱకుండు మతుల. ౧౮

అధికసిద్ధిదముల్ వివిధ తపోవిధులు
అధికరించి మునీంద్రుఁ డనియె నిం దిటులు. ౧౯

ఘనయోగిబృంద వాఙ్మథనామృతమ్ము
అనుభవతమమ మిట్టియది యాహృతము:. ౨౦

# ఏకాదశము.

## తారకరామగీతము.

ద్విపద. నిర్గుణనిష్కళనిత్యనిర్మలిన
నిర్గతమత్సరానీకగమ్యుండ, ౧

సారహీనాపారసంసారమందుఁ
దారకం బీవె, యో దశవదనారి. ౨

సర్వసమత్వంబు సత్సంగతియును
సర్వహితత్వ మ్మొసఁగు నాకు, విభుఁడ. ౩

జనన కష్టమ్మును జావు కష్టమును
జెనుట వచ్చెటను గష్టముఁ బొలియింపు. ౪

కొడుకు నా కెవ్వఁడు? పడఁతి నా కెవ తె?
కడుమాయ యిది, నన్ను గావు, మో విభుఁడ. ౫

సనకసనందనసంస్తుత చరితు
గుణరహితు నినుఁ గన్గొనఁ గలం డెవఁడు? ౬

నాస్తివపువు నీకు నాస్తి నామమును
నాస్తి కర్మంబును, స్వాస్తిద విభుఁడ. ౭

నీ యాకృతియుఁ గర్మ నీ పేర్వివిధము.
మాయచేఁ గల్పిత మీ యఖిలమ్ము. ౮

ద్విపద. నీరామనామమ్మె నిర్మలం, బిదియె
తారకమ్మని ఋషుల్ తారు పల్కుదురు. ౯

అరయ బ్రహ్మవు నీవె, యా చక్రివీవె,
పరమేశ్వరుఁడ వీవె, పరమాత్మ వీవె. ౧౦

పరతత్త్వ సంఘమ్ము పయిని వెలుంగు
పురుషుఁ డీవని సాంఖ్య పుంగవులంద్రు. ౧౧

దశశతపత్రమధ్యమున యోగులును
దశముఖశత్రు నిన్ దారు దర్శింత్రు. ౧౨

ఈ మహి గృతి ఫలం బీవే యటంచు
జైమిని ముఖ్యులు తాము పల్కుదురు. ౧౩

ఏక మ్మభేదమ్ము నీవే యటంచు
వాకొంద్రు వేదాంతవాదులౌ బుధులు. ౧౪

నీకు నాకును వేఱు లేకున్న బుద్ధి
నీ కథఁ బల్కువాణియు దూరదృష్టి ౧౫

దశమవిజ్ఞానంబు తద్దయు నాకు
దశమున కే యాత, దశవదనారి. ౧౬

గణపతికవికృత ప్రణుతి లలితము
ఘనతర ప్రియ మగుఁగావుత నీకు. ౧౭

# శోధనపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 11 | ప్థము | పథము |
| 15 | 15 | వినీ. | విని, |
| 26 | 16 | సేయదగు | సేయఁదగు |
| 42 | 5 | సమిష్టి | సమష్టి |
| 43 | 14 | యేటనె | యేఁటనే |
| 45 | 22 | మటుఁగాక | మటుగాక |
| 48 | 1 | బ్రహ్మ | బ్రహ్మ |
| 87 | 7 | వృధా | వృథా |
| ,, | 9 | బ్రాపించెఁ | ప్రాపించెఁ |
| 90 | 6 | పాధోధి | పాథోధి |
| ,, | 20 | టుఁగర్గె | టుగర్గె |
| 99 | 4 | దలతు | దలఁతు |
| ,, | 8 | తెలుగు | తెలుఁగు |
| 100 | 15 | విథాల | విధాల |
| 102 | 13 | సన్ప్రశార్థ | సద్ప్రశార్థ |
| 103 | 6 | వెవకగ | వెదకఁగ |

| పుట | పం_క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 103 | 6 | వెనకగ | వెనకఁగ |
| ,, | 11 | కుబోయి | కుఁబోయి |
| 104 | 3 | లేదు | లేఁదు |
| 106 | 15 | శోధపడ | శోధపఁడ |
| 107 | 6 | తోట | తోఁట |
| 123 | 5 | బ్రహ్మాండ | బ్రహ్మాండ |
| 124 | 1 | నసుబాణి | నసుఁబాణి |
| ,, | 3 | యట | యిట |
| ,, | 17 | యల | యల్ల |
| 129 | 12 | నన్ను గావు | నన్నుఁగావు |
| 130 | 9 | మహిగృతి | మహీఁగృతి |

### తిరువణ్ణామలై

# శ్రీరమణాశ్రమ పుస్తకాలయము.

భగవాన్ శ్రీ రమణమహర్షి కృతములు:—

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| ఉపదేశసారము (అప్పడపుపాట, ఆత్మవిద్యతో) | | 0 | 1 | 8 |
| ఉన్నది నలుబది ('సద్విద్య' 'నేనెవరు?' తో) | | 0 | 2 | 6 |
| శ్రీ రమణగీత (తాత్పర్యముతో) | కాలికో | 0 | 6 | 0 |
| ,, | అర కాలికో | 0 | 5 | 0 |
| శ్రీ మహర్షి సన్నిధిలో సంభాషణ | | 0 | 2 | 0 |
| విచారసంగ్రహము | | 0 | 1 | 6 |
| ఉపదేశమంజరి | | 0 | 1 | 6 |
| అరుణాచల స్తుతి పంచకము | | 0 | 2 | 0 |
| దేవీకాలోత్తరము (జ్ఞానాచార విచారపటలము) | | 0 | 1 | 6 |
| సర్వజ్ఞానోత్తరే, ఆత్మసాక్షాత్కార ప్రకరణం | | 0 | 1 | 0 |
| వివేకచూడామణి (వచనము) | | 0 | 4 | 0 |
| శ్రీ రమణగీతాసారము (ద్విపద) | | 0 | 1 | 0 |

మహర్షి భక్తులు రచించినవి.

| | | | |
|---|---|---|---|
| శ్రీ రమణ చరిత్రము | 1 | 4 | 0 |
| శ్రీ రమణచరిత్ర సంగ్రహము (ఉపదేశవాక్యములతో) | 0 | 2 | 0 |
| తత్వబోధ | 0 | 1 | 0 |
| అద్వైతబోధదీపిక | 0 | 6 | 0 |
| మాహేశ్వర సూత్రములు | 0 | 8 | 0 |

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| ఇంద్రగీతము | 0 | 0 | 6 |
| దీపముచూడండి | 0 | 0 | 6 |
| ఆత్మధ్యానము అచలము | 0 | 0 | 3 |
| స్తుతిపాటలు | 0 | 1 | 0 |
| రమణతత్వము | 0 | 0 | 3 |
| ప్రణవతత్వము ధ్యానము | 0 | 0 | 6 |
| ఆత్మ స్వరూపము, ద్వైవాన్వేషణ | 0 | 0 | 6 |
| శ్రీరమణమహర్షులవారి చరిత్రసంగ్రహము (సంభాషణ) | 0 | 0 | 6 |
| శ్రీ మహర్షియు తత్సందేశమును | 0 | 6 | 0 |
| శ్రీ గురు అనుగ్రహ అవతారము | 0 | 0 | 6 |
| లాకెట్లు | 0 | 2 | 0 |
| ఆల్బము (112 మహర్షులవారి చిత్రములతో) | 0 | 8 | 0 |

నిరంజనానందస్వామి, సర్వాధికారి.